# చిట్టడవిలో చిన్నారి

అనువాదం:

కొమ్మూరి ఉషారాణి

విదేశ సాహితీ గ్రంథమాల

82. హబిబుల్లా రోడ్,

త్యాగరాయనగరు మద్రాస్—17.

# చిట్టడవిలో చిన్నారి

అనగా అనగా అరవైఏళ్ళ క్రితం, విస్కానిసన్ అనే వూరుప్రాంతంలో ఒక చిట్టడవి వుండేది. అక్కడ చెక్కలతో కట్టిన ఒక యింట్లో ఒక చిన్నారి నివసించేది.

ఆ యింటి చుట్టుతా నల్లగా, పొడుగ్గా వున్న పెద్ద పెద్ద చెట్లుండేవి. ఒక వారం—ఆఖరికి ఒక నెల నడిచివెళ్లినా ఆ చెట్లు తప్ప యింకేమీ కనిపించేవి కావు. ఎక్కడా యిళ్లు వుండేవి కావు. రహదారులు అసలు కనబడేవి కావు. ఇక మనుష్యుల మాట సరేసరి! ఆ చెట్లు, వాటిలో నివసించే క్రూరజంతువులు మటుకే ఎవరికైనా కనిపించేవి.

ఆ ప్రదేశాన్నంతా తోడేళ్లు, ఎలుగుబంట్లు, అడవి పిల్లులు ఆక్రమించుకునుండేవి. నక్కలు కొండల్లో నివాస మేర్పరచుకొన్నాయి. లేడిపిల్లలు ఆ చిట్టడవి అంతా స్వేచ్ఛగా విహరించేవి.

ఆ చిన్న యింటికి తూర్పున, పడమర కూడా, కొన్ని వందల మైళ్ళ దూరం వరకూ ఆ పెద్ద చెట్లే కనుపిస్తాయి. ఆ చిట్టడవి అంచున, దుంగలతో కట్టబడిన యిళ్ళు, అక్కడా అక్కడా కొద్దిమాత్రం కనుపిస్తాయి.

ఆ చిన్నారికి మటుకు యివేమీ కనుపించేవి కావు. తన అమ్మా, నాన్నా, అక్క మేరీ, చిన్ని చెల్లాయి కారీ, వున్న ఆ చిన్న యిల్లే ఆ చిన్నారికి లోకం. బండ్లుపోయే ఒక బాట, ఆ యింటి ముందు కనుపించేది. వంకరటింకరగా వున్న ఆ బాట క్రూరజంతువులున్న చిట్టడవిలో కలిసిపోయేది. ఆ బాట ఎక్కడికి వెళ్ళేదీ, బాట చివర ఏమి వుండేది ఆ చిన్నారికి అసలు తెలియనే తెలియదు.

ఆ చిన్నారిపేరు లారా. లారా నాన్నని "పా" అనీ, అమ్మని "మా" అనీ పిలిచేది. ఆ రోజులలో, ఆ ప్రాంతాల లలో పిల్లలు తల్లి తండ్రుల్ని "నాన్నా" "అమ్మా" అని పిలిచేవారు కారు.

రాత్రిళ్ళు నిద్రపట్టకుండా పక్కమీద పడుకున్నప్పుడు, ఆ పెద్దచెట్లు ఏదో గుసగుస లాడుకున్నట్లు, ఆకుల గరగర వినిపించేది లారాకు. ఒకొక్కప్పుడు దూరాన తోడేలు అరుపు వినిపించేది. కాసేపటికి అది దగ్గరగా వచ్చి అరిచేది.

ఆ అరుపు చాలా భయంకరంగా వుండేది తోడేళ్లు పిల్లల్ని తింటాయని లారాకు తెలుసు. కాని, దుంగలతో కట్టిన యింట్లో లారాకేమీ భయం లేదు. బైట వాకిట ముంగిట్లో వాళ్ళ నాన్న తుపాకీ వేళ్ళాడు తుండేది. ఇంటిముందు, సింహపుపిల్లలాగుండే కుక్క జాకీ కాపలా కాస్తుండేది.

“పడుకోలారా! జాకీ ఆ తోడేళ్ళని లోపలికి రానివ్వదు” అని నాన్న చెబుతుండే. మేరీ దుప్పటి కింద బాగా ముడుచుకుని, మేరీకి దగ్గరగా జరిగి, నిద్రపోయేది లారా.

ఒక రాత్రి లారాను వాళ్ల నాన్న పక్కల్లోంచి ఎత్తుకెళ్ళి తోడేళ్ళను చూపేందుకుని కిటికీ దగ్గరకు తీసుకెళ్ళాడు. ఇంటిముందు రెండు తోడేళ్ళు కూర్చునివున్నాయి. పున్నమినాటి చంద్రుని వంక మూరలు చాచి అరుస్తున్నాయి ఆ తోడేళ్లు అవి అచ్చంగా పెద్దకుక్కల లాగా వున్నాయి.

జాకీ యింటిముందు పచార్లు చేస్తూ, మొరుగుతోంది. దాని వీపు మీద వెంట్రుకలు లేచి నిలబడ్డాయి. జాకీ తన భయంకరమైన, సూదుల్లాంటి పళ్ళని తోడేళ్ళకి చూపెడుతూ మొరగటం ప్రారంభించింది, తోడేళ్లు మళ్ళా మొరిగాయి కాని లోపలికి రాలేక పోయాయి.

లారా చిన్నయిల్లు చాలా బాగుండేది. మేడమీద పెద్ద వసారా వుండేది. పెంకులమీద వాన పడుతుంటే, ఆడుకునేందుకు ఆ వసారా చాలా బాగుండేది. క్రింద ఒక చిన్న పడకగదీ, మరో పెద్దగదీ వుండేవి. పడకగదికి ఒక కిటికీ వుండేది. పెద్ద గదికి రెండు కిటికీలుండేవి. ఈ కిటికీలకి చెక్క తలుపులుండేవి. పెద్ద గదిలోని కిటికీలకి గాజు తలుపులుండేవి. ఈ గదికి రెండు వైపులా రెండు ద్వారాలుండేవి. ఎలుగుబంట్లు, లేడిపిల్లలు రాకుండా యింటి చుట్టూతా ముళ్ళ కంచెతో దడి వుండేది.

ఇంటి ముందర తోటలో రెండు చక్కని పెద్ద మద్రి చెట్లుండేవి. ప్రతి ఉదయం నిద్ర లేస్తూనే, లారా కిటికీ దగ్గిరికి పరుగెత్తి, బైటికి చూసేది. ఒకరోజు పొద్దున్నే

లారాకు ఆ రెండు చెట్ల కొమ్మలనుంచీ రెండు చచ్చిన లేడి పిల్లలు వేళ్ళాడుతుండటం కనిపించింది.

అంతకు క్రితం రోజునే 'పా' ఆ లేడి పిల్లల్ని చంపాడు. రాత్రి లారా నిద్రపోతున్నప్పుడు వాటిని యింటికి పట్టుకొచ్చాడు. తోడేళ్లు తినకుండా వుండేందుకు వాటిని చెట్టుమీద ఎత్తుగా కట్టి వుంచాడు.

ఆ రోజు పా, మా, లారా, మేరీ ఆ మాంసాన్ని రుచిగా వండుకు తిన్నారు. ఆ మాంసం ఎంతో బాగుండటం వల్ల, మొత్తం అంతా తినేయాలనిపించింది లారాకు. కాని అందులో చాలామటుకు, ఉప్పు పాతరలో వేసి, వర్షాకాలంలో తినేందుకు దాచిపెట్టవలసి వచ్చింది.

అప్పుడే చలి కాలం వచ్చేస్తూంది. ప్రొద్దు తక్కువ. ఎక్కడ చూసినా మంచు. రాత్రిళ్ళు అద్దం కిటికీలన్నీ మంచుతో నిండిపోతున్నాయి. ఇక ఆ యిల్లంతా దాదాపు మంచులో కప్పబడిపోతుందేమో! తెలువులూ, నదులూ, గడ్డకట్టుకు పోవచ్చు. విపరీతమైన ఆ చలి కాలంలో, ఆహారానికి జంతువులుకూడా దొరకక పోవచ్చు.

ఆ చలి కాలమంతా, ఎలుగుబంట్లు వాటి వాటి గుహల్లో హాయిగా పడుకుని నిద్రపోతాయి. ఉడతలు చెట్టు తొర్రలలో వాటి తోకలతో వొళ్ళంతా కప్పుకుని, ముడుచుకుని పడుకుంటాయి. కుందేళ్లు, లేడిపిల్లలు మటుకు గెంతుతూ, పరుగెడుతూ వుంటాయి. ఒక వేళ 'పా' కి లేడిపిల్ల దొరికినా, తతిమ్మా రోజులలో మల్లె పుష్టిగా కాక, పీలగా, సన్నగా వుండేది అది.

విపరీతమైన చలిలో, మంచుతో కప్పబడిన ఆ చిట్టడవిలో, రోజంతా వేటాడినా 'పా'కి ఏవీ చిక్కేది కాదు.

మాకీ, మేరీకీ, లారాకీ, ఏమీ లేకుండా, వట్టి చేతులతో ఒక రాత్రి యింటికి తిరిగి వచ్చేవాడు పా.

అందుకని దొరికినంతమటుకు, చలి కాలం రాకముందే ఆహారాన్నంతా దాచి వుంచవలసి వచ్చేది.

మెత్తని తోలు తయారు చేసేందుకని, లేడి పిల్లల చర్మాన్ని జాగ్రత్తగా ఒలిచి, ఉప్పుపూసి, సాగదీసేవాడు పా. ఆ తర్వాత మాంసాన్ని ముక్కలు ముక్కలుగా కోసి, ఉప్పు జల్లి, కొయ్య పెట్టెలో దాచిపెట్టేవాడు.

ఇంటిముందు తోటలో పెద్ద చెట్టునుంచి ఒక దుంగ వేళ్ళాడుతుండేది. రెండు వైపుల నుంచీ దానిమీద మేకులు కొట్టాడు పా. తర్వాత దానిని నిలబెట్టి, పైన మూతవేసి, కింద ఓ పక్కగా చిన్న దారి చేశాడు. తోలు ముక్కలతో, దాన్ని గట్టిగా కొట్టేశాడు.

కొద్ది రోజులు ఉప్పులో వేసిన తర్వాత ఆ లేడి మాంసాన్ని, ముక్కలుచేసి, ప్రతి ముక్క అంచున చిల్లిచేసి, దారంతో అన్నిటినీ కలిపి కట్టేవాడు. లారా ఇదంతా గమనిస్తూ వుండేది.

దుంగలోని చిన్న ద్వారంగుండా లోపలికిపోయి, తనకి అందినంత మేర మేకులకి మాంసాన్ని తగిలించేవాడు పా. ఆ తర్వాత నిచ్చెన వేసుకు పైకి ఎక్కి, మూతని ఒక పక్కకి తోసి, తతిమ్మా మేకులకి మాంసాన్ని తగిలించేందుకు లోపలికి దిగేవాడు.

మూత పెట్టేసిన తర్వాత, నిచ్చెన దిగివచ్చి, లారాతో "నేను చెక్కలు కొట్టిన చోటుకు పరుగెత్తుకెళ్ళి, శుభ్రమైన మంచి చెక్క ముక్కలను పట్రా" అనేవాడు.

లాగా ఆ చెక్కల దగ్గరకు పరుగెత్తుకెళ్ళి, తన చొక్కానంతా ఆ సువాసన గల చెక్క ముక్కలతో నింపుకునేది.

ఆ దుంగకి అడుగున ఉన్న చిన్న తలుపు లోపల పా మంట పెట్టాడు. దానిమీద చెక్క ముక్కలను జాగ్రత్తగా పేర్చాడు. భగ్గున మంట రావటం పోయి, లోపలంతా దట్టమైన పొగ బయలుదేరింది. పా ఆ తలుపు మూసేశాడు. కింద తలుపు సందుల్లోంచి కొంచెం పొగా, పైన మూత లోంచి కొంచెం పొగా వస్తూనే వుంది కాని చాలా భాగం మాంసాన్ని ఆవరించింది. "ఈ పొగకంటె మంచిది యింకొకటి లేదు. ఏ కాలంలోనైనా ఆహారం రుచిగా ఉండేటట్లు చేయగలదు ఈ పొగ" అన్నాడు పా. ఆ తర్వాత తుపాకీ తీసుకుని, గొడ్డల్ని భుజాన వేసుకుని, మరికొన్ని చెట్లని కొట్టేందుకు వెళ్లిపోయేవాడు.

లాగా, మా ఆ మంటని ఎన్నో రోజులు చూసేవారు. దుంగ సందుల్లోంచి పొగ రావటం ఆగిపోతూనే, లారా మరికొన్ని చెక్కలను తీసుకువచ్చేది. మా నాటితో మాంసం కింద మంట పెట్టేది. తోటలో ఎప్పుడు చూసినా, కొద్దిగా పొగ వాసన ఉండేది. తలుపు తీసినపుడు, యింకా దట్టంగా, మాంసం వాసనతో బైటికి వచ్చేది ఆ పొగ.

ఆఖరికి మాంసానికి బాగానే పొగ పట్టిందన్నాడు పా. అందరూ కలిసి నిప్పును ఆర్పేసిన తరువాత, పా ఆ దుంగలోంచి మాంసపు ముక్కలను తీశేశాడు. మా ఒక్కొక్క ముక్కనీ శుభ్రంగా కాయితంలో చుట్టి, చెడిపోకుండా వుండేందుకు అలమారులో పెట్టాడకట్టింది.

ఇక రోజూ తెల్లారుతూనే పా గుఱ్ఱంబండిని తీసుకుని పేటకి వెళ్ళేవాడు. ఆ వేళ రాత్రి బండినిండా చేపలతో

యింటికి తిరిగివచ్చాడు. బండీ మొత్తం చేపలతో నిండిపోయి ఉంది. అందులో కొన్ని చేపలు లారా అంత పెద్దవిగా వున్నాయి. లేక్ పెపిన్‌కు వెళ్లి, వలతో వాటిని పట్టుకున్నాడు పా.

ఒక్క ఎముక కూడా లేకుండా, ఆ తెల్లని చాపల్ని ముక్కలుగా కోసి, లారాకీ, మేరీకీ పెట్టింది మా. ఆ చేపలతో వాళ్ళంతా ఒక పండుగ భోజనం జరుపుకున్నారు. ఆవేళ తినగా మిగిలిన చేపల్ని ఉప్పులో వేసి, చలి కాలానికి పీపాలలో దాచారు.

పా ఒక పందిని పెంచేవాడు. దుంపలు, మూలికలు తింటూ అది ఆ చిట్టడవిలో స్వేచ్ఛగా తిరుగుతుండేది. పా దాన్ని యిప్పుడు దుంగలతో చేసిన గుహలో పడేశాడు. ఆ గుహలో అది బాగా బలుస్తుంది. చలి కాలం వస్తూనే దాన్ని కూడా చంపి, మాంసం దాచిపెట్టాలని పా వుద్దేశం.

ఒకరోజు అర్ధరాత్రి ఆ పంది అరుపు విని లారా నిద్ర లేచింది. పా ఒక్కసారి పక్కమీంచి లేచి, గోడనున్న తుపాకీ తీసుకుని, బైటికి పరిగెత్తాడు. లారాకి రెండుసార్లు ఆ తుపాకీ ప్రేలుడు వినిపించింది.

పా తిరిగివచ్చి జరిగినదంతా చెప్పాడు. పందిని దాచిన గుహ పక్కనే పాకి ఒక నల్లని ఎలుగుబంటి కనిపించింది. పందిని పట్టుకునేందుకు అది గుహలోకి జొరబడుతోంది. అది చూసి పంది అరుస్తూ, పరుగెత్తుతోంది. వెన్నెట్లో ఆ దృశ్యం చూడగానే పా వెంటనే తుపాకీ పేల్చాడు. కాని అంతగా వెలుగు లేకపోవటం వల్ల ఎలుగుబంటి తప్పించుకు పోయింది. దెబ్బ తగలకుండానే అది చిట్టడవిలోకి పారిపోయింది.

పా కి ఎలుగుబంటి చిక్కనందుకు లారా చింతించింది. ఆ చిన్నారికి ఎలుగుబంటి మాంసమంటే చాలా యిష్టం. పా

కూడా విచారించాడు. కాని, "పోనీలే! పంది మాంసమున్నా దక్కింది" అన్నాడు.

ఆ చిన్న యింటికి వెనుక పక్క వున్న తోట వేసంగిలో బాగా పండేది. ఆ తోట యింటిని అంటిపెట్టుకుని ఉండేది.

అందుకని పగలు లేడిపిల్లలు దడి దుమికి, కాయగూరలు తినేవి కావు రాత్రిళ్ళు జాకీ కాపలా కాసేది. ఒక్కొక్కప్పుడు కారెట్, కాబేజీల మధ్య అడుగు జాడలు కనుపించేవి. కాని వాటి వెనకగా జాకీ కాలి గుర్తులు కూడా వుండేవి.

చలికాలం రాబోతోంది గనుక, ఉర్లగడ్డలనీ, కాబేజీలనీ, టర్నిప్స్‌నీ, మా వంట యింట్లో భద్రపరిచేది. ఉల్లిపాయలు వరుసగా దారంతో కట్టి పైన తగిలించేది. వంట యింట్లో ఓ మూలగా సొరకాయలనీ, అనపకాయలనీ కుప్పగా పోసేది. అలమారులో ఉప్పులో వేసిన చేపలూ, చీస్ (జున్నుగడ్డ) పెట్టేది.

ఓ రోజు హెన్రీమామ చిట్టడవినుంచి గుఱ్ఱం ఎక్కి వచ్చాడు. పందిని కోయటంలో పాకి సాయంచేసేందుకు వచ్చాడు మామయ్య. మా దగ్గిరున్న పెద్ద కత్తిని అప్పటికే పదును పెట్టి వుంచారు. హెన్రీ, అత్తయ్య పోలీ కత్తి తెచ్చాడు.

పంది గుహ దగ్గిర పా, హెన్రీ మంటపెట్టి, గిన్నెలో నీళ్ళు కాచటం మొదలుపెట్టారు. ఆ నీళ్ళు కాగుతుండగా, వాళ్లిద్దరూ పందిని చంపేందుకు వెళ్ళారు. లారా ఒక్కమ్మ డిన పరుగెత్తుకెళ్ళి, పక్కలో తల దూర్చి, ఆ పంది అరుపు వినబడకుండా, చేతులతో చెవులు మూసుకుంది "దానికేమీ బాధవుండదు లారా! మేము చాలా తొందరగా

-చంపేస్తాము" అన్నాడు పా. కాని లారాకి దాని అరుపు వినటం యిష్టం లేదు.

ఒక నిముషమయాక, చెవి దగ్గరనుంచి ఒక వేలు తీసేసి, విన్నది లారా. పంది అరవటం మానేసింది. ఆ తర్వాత పందిమాంసం కోసేటప్పుడు చాలా సరదాగా వుంది.

ఆ రోజంతా ఎవరికీ తీరిక వుండేది కాదు. పా, మామయ్య, చాలా ఉత్సాహంగా వున్నారు, లారాకీ, మేరికీ, పంది బ్లాడర్, తోక, యిస్తానని మాట యిచ్చాడు పా.

పంది చనిపోతూనే, పా, హెన్రీ కలిసి, బాగా ఉడికేంతవరకూ దానిని వేడినీళ్లలో ముంచారు. తర్వాత దాన్ని ఒక బల్లమీద పెట్టి, పైన బొచ్చు రాలేంతవరకూ, కత్తులతో గీకారు. ఆ తర్వాత, పంది లోపలిభాగాలన్నీ తీసేసి, చల్లబడేందుకు దాన్ని ఒక చెట్టుకి వేళ్ళాడగట్టారు.

చల్లబడిన తరువాత దాన్ని చెట్టునుంచి తీసి, ముక్కలు చేశారు. పంది పొట్ట, గుండెకాయ, తల, నాలుక, అన్నీ విడి విడిగా కోశారు. పెరట్లోని గదిలో ఒక బల్ల మీద ఆ మాంసాన్నంతా పేర్చి, ఒక్కొక్క ముక్కమీద ఉప్పు జల్లారు. పంది జబ్బలు, కాళ్ళనీ మటుకు, దుంగలో కాల్చేందుకు ఉప్పులో ఊరవేశారు.

పంది కాలు చాలా రుచిగా వుంటుంది" అన్నాడు పా.

పంది బ్లాడరుని తీసి, తెల్లని బెలూను. మల్లె, దానిని ఊది, అంచున ఒక దారం కట్టి, మేరీకీ లారాకీ ఆడుకోమని యిచ్చాడు పా. గాలిలో అటూ ఇటూ ఎగురవేస్తూ

ఆడుకునేందుకు అది చాలా బాగుంది. అంతేకాదు; కింద పడేసి, కాలితో దొర్లించేందుకు అది ఉపయోగపడుతుంది. కాని, దానికంటె కూడా పందితోక యింకా సరదాగా వుంది.

పిల్లలు ఆడుకునేందుకు, పా తోకమీద తోలుని జాగ్రత్తగా వూడదీసి, దాని అంచున ఒక వాడియైన కఱ్ఱ కట్టాడు. 'మా' పెద్ద బొగ్గులతో మంటపెట్టింది. మేరీ, లారా, వంతుల చొప్పున, పందితోకను నిప్పులో పెట్టి, ఆడుకున్నారు.

ఎఱ్ఱని మంటలో ఉడికి, తోకలోని మాంసమంతా కిందపడింది. మా దానిమీద ఉప్పు జల్లింది. వాళ్ళ ముఖాలు, చేతులు, ఆ వేడికి కమిలిపోయాయి. లారా వేలు కాలింది. కాని ఆ సరదాలో బాధేమీ తెలియలేదు. పంది తోకని కాల్చటంలో ఎంత ఆనందముందంటే, లారా, మేరీ న్యాయంగా వంతులచొప్పున ఆడుకోవటం కష్టమయిపోయింది.

చిట్ట చివరికి అది పూర్తయింది. అది చక్కగా కాలడమే కాదు, ఘుమ ఘుమ వాసన కూడా కొట్టింది. చల్లారబెట్టేందుకని దాన్ని తోటలోకి తీసుకెళ్ళారు వాళ్ళు, ఇంకా చల్లబడకముందే ఆతురతతో, రుచి చూసి, నాలుకలు కాల్చుకున్నారు.

ఎముకలు మినహా, మాంసాన్ని మొత్తం తినేసి, ఆ ఎముకలు జాక్‌కి యిచ్చారు.

భోజనాలయిపోయాక, హెన్రి మామయ్య వాళ్ళింటికీ పా చిట్టడవిలో పని చూసుకునేందుకూ, వెళ్ళిపోయారు.

కాని మాకి, మేరీకి, లారాకి; యింకా ముందు చెయ్యవలసిన పని ఎంతయినా వుంది. మేరీ, లారా, మా పనిలో సాయ పడ్డారు.

ఆ రోజూ, ఆ మరుసటి రోజూ కూడా, మాకి పంది మాంసంలోని కొవ్వు తీయటంతో సరిపోయింది. మేరీ, లారా, పొయ్యిలోకి కట్టెలు పట్టుకొచ్చారు. పొయ్యిలో నిప్పు మరీ ఎక్కువైతే, కొవ్వు పాడయి పోతుంది. పొయ్యి మీద గిన్నెలు బాగా వేడి పడాలి గాని, పొగ రాకూడదు. ఉండి ఉండి మా వేడిపడిన ముక్కలని తీసేస్తూ వచ్చింది. వాటిని ఒక గుడ్డతో పిండి, కొవ్వు వచ్చేసిన తరువాత, విడిగా పెట్టింది. ఆ తర్వాత ఆ ముక్కలతో కేకులు తయారు చేసింది.

ఆ ముక్కలు చాలా రుచిగా వుండేవి. కాని చిన్న పిల్లలు అవి తినకూడదని మా చెప్పటంవల్ల, లారాకి, మేరీకి ఎక్కువ దక్కలేదు.

మా పంది తలమీద బొచ్చునంతా తీసేసి, శుభ్రం చేసింది. తర్వాత ఎముకలు మటుకు మిగిలేంత వరకూ దానిని కాల్చింది. తర్వాత చెక్క గిన్నెలో, ఆ మాంసాన్ని కత్తితో ముక్కలు ముక్కలుగా కోసి పెట్టింది. తర్వాత వాటి మీద ఉప్పు, మిరియాలు జల్లింది. చల్లారబెట్టాక దాన్నే "హెడ్ చీస్"గా తయారు చేసేది మా.

పెద్ద ముక్కలు కోస్తున్నప్పుడు కింద పడిన చిన్న చిన్న మాంసపు ముక్కల్ని, చక్కగా ఉప్పు, మిరియాలు జల్లి, పెనంమీద కాల్చి, చిన్న ఉండలు కట్టేది మా. ఆ ఉండల్ని ఒక పళ్లెంలో పెట్టి, కొట్టు గదిలో దాచేది. చలి

కాలంలో తినేందుకు అవి ఎంతో బాగుండేవి. అన్ని వంట కాలతో, వంటయిల్లంతా ఘుమఘుమ లాడిపోయేది.

ఆకురాలు కాలం ప్రారంభమయి, అరు బయలంతా చలిగా వుండటం వల్ల, లారా, మేరీ యింట్లోనే ఆడుకోవలసి వచ్చింది. చలిమంట అసలు ఆర్పేవాళ్ళు కాదు. పొయ్యి తెల్లవార్లూ మండేందుకని పా బూడిద తీసేసి, బొగ్గులని ఎప్పటికప్పుడు శుభ్రం చేసేవాడు.

లోపల గది ఆడుకునేందుకు చాలా బాగుండేది. గుండ్రంగా, పెద్దగా, రంగు రంగులుగా వున్న గుమ్మడి కాయలు కుర్చీలుగా, బల్లలుగా పనికొచ్చేవి. ఉల్లిపాయలు, పందికాళ్లు కట్టిన కాయితం పొట్లాలు, వంట సామగ్రి, పైన వేళ్ళాడుతూ, తలకి తగిలేవి. వీటన్నిటివల్ల ఆ గదికి ఒక రుచికరమైన వాసన వచ్చేది.

తరుచు బైట భయంకరమైన ఈదురుగాలి వీచేది. కాని లారాకీ, మేరీకీ ఎంతో వెచ్చగా వుండేది. ఆ గుమ్మడి కాయలనీ మిగతా సామగ్రినీ వాళ్లు ఒక యిల్లులాగ పెట్టుకుని ఆడుకునేవారు.

మేరీ, లారాకంటె పెద్దది. మేరీకి నెట్టీ అనే బొమ్మ ఉండేది. లారాకి జేబు రుమాలుతో చేసిన ఒక గుడ్డబొమ్మ వుండేది. దానిపేరు సూసాన్. అదీ చక్కని బొమ్మే. అప్పుడప్పుడూ, సూసాన్ చూడకుండా, మేరీ తన నెట్టీని లారాకు ఎత్తుకోనిచ్చేది.

రోజంతట్లోకి రాత్రిళ్ళు బలే సరదాగా వుండేవి. రాత్రి భోజనాలయాక, పా కోట్టు గదిలోంచి తన పరికరాలు తెచ్చే వాడు. పొయ్యి దగ్గర వాటికి నూనె పట్టించేవాడు. ఆ పరి

కరాలు తళ తళ మెరిసేటట్లు తుడిచి, తర్వాత ఒక ఈకని పంది నూనెలో ముంచి, వాటికి పూసేవాడు.

పందితోలు, పళ్ళతో తయారు చేసిన ఆ వలలు చిన్నవీ పెద్దవీ అనేక రకాలుగా వుండేది. ఎటువంటి మనిషైనా ఆ వలలో పడిపోగలడని చెప్పేవాడు పా.

వాటికి నూనె పూస్తున్నంతసేపూ, లారాకీ, మేరీకీ చక్కటి కథలూ, కబుర్లూ చెప్పి నవ్వించేవాడు పా. తర్వాత తన సితారా వాయించేవాడు.

కిటికీల దగ్గరనుంచీ, అన్ని తలుపులనూ గట్టిగా బిగించేసి, కాస్తంత కూడా లోపలికి చలి రాకుండా వాటి సందుల్లో గుడ్డలు కుక్కేవాళ్ళు. కాని ముందుగది అడుగున ఓ చిన్న సందు వుంది. పగలు రాత్రి కూడా నల్లపిల్లి సూసాన్, తన యిష్టమొచ్చినట్లు దాంట్లోంచి లోపలికీ బైటికీ తిరుగుతుండేది.

అది తొందరగా పరుగులు తీస్తూ వెళ్ళినా, తలుపులో ఎప్పుడూ దాని తోక యిరుక్కునేది కాదు.

ఓ రోజు రాత్రి వలలకి నూనె రాస్తూ, నల్ల పిల్లి లోపలికి రావటం చూసి, పా, "పూర్వం ఒకతను వుండేవాడు. అతనికి రెండు పిల్లులు వుండేవి. ఒకటి పెద్దది, ఒకటి చిన్నది." తలిమ్మా కథంతా వినేందుకని, లారా, మేరీ, అతని కాళ్ళ దగ్గర చేరారు. "అతనికి రెండు పిల్లులు వుండేవి. ఒకటి పెద్దది. ఒకటి చిన్నది. పెద్దదానికోసరం పెద్దది, చిన్నదాని కోసరం చిన్నది, అతను తలుపులో రెండు సందులు చేశాడు. పా ఆగాడు. "కాని చిన్న పిల్లి ఎందువల్ల—" అంటూ మొదలు పెట్టింది మేరీ. "పెద్దపిల్లి ఒప్పుకోదు గనక—" అంటూ అడ్డు తగిలింది లారా. "లారా చాలా తప్పమ్మా?

అలా మధ్యలో అడ్డు తగలకూడదు" అన్నాడు పా. "కాని నాకు ఒక్కటిమాత్రం తెలిసింది. తలుపులో రెండు సందులు చేసినవాడికన్నా మీలో ఒకరికి ఎక్కువ తెలివి తేటలున్నాయి" అన్నాడు మళ్ళీ పా. ఆ తర్వాత వలలు పక్కన పెట్టేసి పెట్టెలోంచి సితార్ తీసి వాయించటం మొదలు పెట్టాడు. ఆ వాయింపు చెవులకి చాలా ఇంపుగా వుండేది.

* * *

మంచు, దానితో విపరీతమైన చలి, ప్రారంభమయ్యాయి. తన తుపాకీ, వలలు తీసుకుని, పా పగలంతా చిట్టడవికి వెళ్ళి పోయేవాడు. నది అంచున దొరికే జంతువులకు కొన్ని వలలు, అడవి మధ్య దొరికే నక్కలకీ, తోడేళ్ళకీ పెద్ద వలలు, పట్టుకెళ్ళేవాడు పా. చలి కాలంలో ఎలుగుబంట్లన్నీ గుహల్లో దాక్కునేయుండే ఒక పెద్ద ఎలుగుబంటిని పట్టుకునేందుకు చాలా పెద్ద వల తయారు చేశాడు పా.

ఒక రోజు పొద్దున, అడవినుంచి తిరిగివచ్చి, గుఱ్ఱం బండీని తీసుకుని మళ్ళా తొందరగా వెళిపోయాడు పా. అడవిలో ఒక ఎలుగుబంటిని చంపాడు. అది విని లారా మేరీ సంతోషం పట్టలేక, చప్పట్లు చరుస్తూ, గంతులేయటం ప్రారంభించారు. "నాకు ఎలుగుబంటి మోకాలు కావాలి అంటూ కేకలు పెట్టింది మేరీ ఎలుగుబంటి మోకాలు ఎంత పెద్దదిగా వుంటుందో మేరికి తెలీదు.

బండిలో ఒక ఎలుగు బంటినీ, పందినీ వేసుకువచ్చాడు పా. బుజాన తుపాకీ, చేతిలో పెద్ద వలపట్టుకుని, పా అడవంతా తిరుగుతున్నాడు. అలా మంచుతో కప్పబడిన ఒక దేవదారు చెట్టు దగ్గిరికి వెళ్ళేటప్పటికి, ఆ చెట్టు

తెన కా తలే ఎలుగుబంటి కనుపించింది. అప్పుడే ఆ ఎలుగుబంటి ఒక పందిని తినేందుకు తయారవుతోంది. ముందు రెండు కాళ్ళూ ఎత్తి, అవి చేతులకి మల్లె, పందిని పట్టుకుంది ఆ ఎలుగుబంటి. పా వెంటనే ఎలుగుబంటిని చంపేశాడు. ఆ పంది అసలు ఎవరిదో, ఎక్కడినుంచి వచ్చిందో, తెలుసుకునేందుకే అవకాశం లేకపోయింది. "అందుకని నేను పంది మాంసం యింటికి పట్టుకొచ్చేశాను" అంటూ తన కథ ముగించాడు పా.

చాలా రోజులవరకూ పనికొచ్చేలా బోలెడంత మాంసం దొరికింది. పగలూ, రాత్రీ కూడా విపరీతంగా చలి వుండటం వల్ల పెరట్లోని చిన్న గదిలో పడేసిన ఆ మాంసం కరిగిపోకుండా, చక్కగా గడ్డ కట్టుకు పోయింది.

అన్నంలోకి 'మా' కి మాంసం కావలసివచ్చినప్పుడు, పా తన గొడ్డలితో గడ్డ కట్టిన ఎలుగుబంటి మాంసాన్ని ముక్కలుచేసి తెచ్చేవాడు. తతిమ్మా వంటకాలన్నీ కొట్టు గదిలోంచో లేక వంటయింట్లోంచో మా తెచ్చుకునేది.

ఇంటిచుట్టూతా, బోలెడంత మంచు పేరుకునిపోయి ఉండేది. కిటికీ అద్దాలమీద మంచు, చెట్లు, ఆకులు, దేవతలు బొమ్మలకిమల్లె, గమ్మత్తుగా వుండేది.

రాత్రిళ్ళు అంతా నిద్రపోతున్నప్పుడు, జాక్ ఫ్రాస్టు వచ్చి, ఆ బొమ్మలు వేస్తాడని చెప్పేది మా. జాక్ ఫ్రాస్టు' మంచులా తెల్లగా వుండే ఒక చిన్న మనిషి అనీ, లేడిపిల్ల చర్మంతో చేసిన తెల్లని చెప్పులు తొడుక్కుంటాడనీ, తల మీద తళతళ మెరిసే టోపీ పెట్టుకుంటాడనీ, అనుకునేది మేరీ. తెల్లని చొక్కా, తెల్లని చేతిమేజోళ్ళు తొడుక్కుని, బుజంమీద తుపాకీ లేకుండా, బొమ్మలు చెక్కేందుకు

చేతుల్లో తళ తళ లాడే సూదుల్లాటి పరికరాలు పట్టుకుని, ఆ జాక్ వస్తాడని ఊహించుకునేది మేరీ, లారా, మేరీ, మా తో బాటు ఆ కిటికీ అద్దాలమీద చక్కని గీతలు గీసే వారు, కాని రాత్రిళ్లు జాక్ బొమ్మలని మటుకు పాడుచేసే వారు కాదు.

అద్దం దగ్గిరగా ముఖం పెట్టి, నోటితో ఊదుతూనే, ఆ తెల్లని మంచు కరిగి, చుక్కలు చుక్కలుగా అద్దం నుంచి కిందపడేది. అప్పుడు కిటికీలోంచి, చూస్తే, అరు బైట నల్లని పెద్ద చెట్లూ, ఆ చెట్ల నీడన తెల్లని మంచూ కను పించేది.

రోజూ పొద్దున్నే గిన్నెలని కడిగేపని ఉండేది. ఇందులో లారా, మేరీ, మాకు సాయపడేవారు. లారా కంటె పెద్దది కావటంవల్ల, మేరీ ఎక్కువ గిన్నెలని కడిగేది, కాని లారా తన గ్లాసునీ, పళ్లాన్నీ శుభ్రంగా కడుక్కునేది.

ఆ గిన్నెలన్నీ కడిగిపెట్టే వేళకు, మంచం దులపవలసి వచ్చేది. లారా, మేరీ చెరొక పక్కన నిలబడి, దుప్పటి లాగివేసి, కాళ్ల దగ్గిరా, పక్కలా మడిచి, దిళ్ళు బొత్తుగా చేసి పెట్టేవారు. తర్వాత మా ఆ మంచాన్ని పెద్ద మంచం కిందికి తోసేది.

ఆ పని అయిపోయిన తర్వాత, మా ఆ రోజు చెయ్య వలసిన పని మొదలుపెట్టేది. ఒక్కొక్క రోజుకి వాళ్లు ఒక్కొక్క పనిని కేటాయించుకున్నారు.

"సోమవారం ఉతకటం
మంగళవారం ఇస్త్రీ పెట్టటం
బుధవారం కుట్టటం

గురువారం వెన్న తీయటం
శుక్రవారం ఇల్లు శుభ్రం చేయటం
శనివారం రొట్టెలు కాల్చటం
ఆదివారం విశ్రాంతి తీసుకోవటం"

అదీ వాళ్ళ కార్యక్రమం. వారంలోకంతా, వెన్న తీసే రోజూ, రొట్టె కాల్చే రోజూ అంటే లారాకి యిష్టం.

చలి కాలంలో, వేసంగిలోకిమల్లె వెన్న పచ్చగా ఉండదు. అందులోంచి తీసే మీగడ కూడా తెల్లగా, ఉంటుంది. భోజనానికి కూర్చున్నప్పుడు, బల్లమీద పెట్టుకునే వన్నీ అందంగా ఉండాలి అనేది మా. అందుకని చలి కాలంలో వెన్నకి రంగు పూసేది.

మీగడని ఒక గిన్నెలో వేసి, పొయిదగ్గర పెట్టిన తర్వాత, ఒక పొడుగాటి నారింజరంగు కారెట్టు తెచ్చి, శుభ్రంగా కడిచేది. తర్వాత కన్నాలున్న పాత రేకుమీద దానిని తిరిగేది. పా ఆ రేకుకి కన్నాలు చేసిపెట్టాడు. బాగా తరిగిన తర్వాత, రేకు తియ్యగానే, దాని అడుగున, కారెట్ ముక్కలు ముక్కలుగా పడివుండేది. తర్వాత పొయ్యి మీద పాలు కాగబెట్టి, కారెట్ ముక్కల్ని ఆ పాలల్లో వేసేది. కాస్సేపటికి ఒక గుడ్డతో ఆ పాలని వడగడుతూనే, వెన్నంతా పచ్చగా అయిపోయేది.

పాలు పిండేయగా మిగిలిన కారెట్ ముక్కల్ని, లారా, మేరీ తినేవాళ్లు. తను పెద్దది కనుక ఎక్కువ కావాలనేది మేరీ. లేదు తను చిన్నది కనుక తనకే ఎక్కువ కావాలనేది లారా. కాని మా వాళ్లిద్దరినీ సమంగా పంచుకు తిన మంది. ఆ కారెట్ ముక్కలు చాలా రుచిగా ఉండేవి.

వెన్న తయారవుతూనే, మా కుండలో వెన్న చిలక రించే కవ్వం వేసేది. ఆ కవ్వానికి మధ్య ఒక రంధ్రముండేది. అది పట్టుకుని కవ్వాన్ని అటూ యిటూ తిప్పేది మా. మా చాలాసేపు వెన్న తీసేది. అప్పుడప్పుడూ మేరీ కూడా చిలి కేది. కాని లారామటాకు ఆ బరువైన కవ్వాన్ని పట్టుకో గలిగేది కాదు.

మొదట్లో వెన్న కవ్వం చుట్టూ ముద్దగా కనుపించేది. చాలాసేపు చిలికిన తర్వాత అది విడిపోయేది. మా మెల్లిగా చిలకటం ప్రారంభించిన తర్వాత, అది పచ్చగా పైకి వచ్చేది. మా కవ్వం తియ్యగానే, మజ్జిగలో బంగారు ముద్దలా తేలేది ఆ వెన్న. ఒక చెక్క గరిటతో ఆ ముద్దని బయటికి తీసి, గిన్నెలో వేసేది మా. తర్వాత దాన్ని చన్నీళ్ళలో బాగా శుభ్రంచేసి, ఉప్పు జల్లేది.

వెన్న తీయటంలోకంతా సరదా అయిన పని ఆ వెన్నని డబ్బాలో వేయటం. ఒక కొయ్య డబ్బాలో ఆ వెన్నని పెట్టివుంచేది మా. ఆ డబ్బా అడుగున, ఒక చెట్టు, ఆకులు ఉన్న బొమ్మ ఉండేది. మా గరిటతో ఆ డబ్బానిండా వెన్న కుక్కేది. తర్వాత దాన్ని ఒక కంచంలో బోర్లించి, అడుగుమూత తీసేసేది. చెట్టు, ఆకులబొమ్మ ఆకారంతో సహా, వెన్నముద్ద కిందపడేది.

మాకి చెరిఒక ప్రక్కా నుంచుని, ఆ తంతు అంతా నోరు తెరుచుకు చూసేవారు లారా, మేరీ. తర్వాత మా వాళ్ళిద్దరికీ మజ్జిగ యిచ్చేది.

శనివారాలు రొట్టెలు చేసేటప్పుడు, వాళ్ళిద్దరికీ కొద్దిగా రొట్టెపిండి దొరికేది. దాంతో వాళ్ళు చిన్న రొట్టెలు చేసు కునేవారు. అప్పుడప్పుడు పిండివంటలు చేసుకునే పిండికూడా

వాళ్ళకి దక్కేది. ఒకసారి లారా తన చిన్న పెనంలో బూరెలు చేసింది.

పని పూర్తవుతూనే, మా ఒక్కొక్కప్పుడు వాళ్ళకి కాయితాలతో బొమ్మలు చేసి యిచ్చేది. తెల్లని దళసరి కాయితాలతో బొమ్మలుచేసి, పెన్సిలుతో ముఖాలు గీసేది. ఆ బొమ్మలకి చొక్కాలు, టోపీలు, రిబ్బనులు, లేసులు వగైరాకి రంగు కాయితాలు కత్తిరించేది. మేరీ, లారా, వాటితో తమ బొమ్మల్ని చక్కగా అలంకరించేవారు.

కాని రోజులోకంతా రాత్రిళ్లు పా యింటికి తిరిగి వచ్చినప్పుడు, ఎంతో బాగుండేది.

మంచుతో నిండిన చిట్టడవినుంచి రావటంవల్ల పా మీసాల అంచున యింకా మంచు వేళ్ళాడుతుండేది. తుపాకిని గోడకి తగిలించి, టోపీ, చొక్కా, చేతి మేజోళ్ళు తీసేస్తూ, "నా ద్రాక్షరసం ఎక్కడుందీ!" అని కేకేసేవాడు.

అది లారా ముద్దుపేరు. అందరిలోకీ చిన్నపిల్ల కావటం వల్ల లారాని అలా గారాబుగా పిలిచేవాడు పా.

వెంటనే నిప్పుదగ్గిర చలికాచుకుంటున్న పా ఒళ్ళోకి పరుగెత్తేవారు మేరీ, లారాలు. పా మళ్ళీ టోపీ, చొక్కా, చేతి మేజోళ్ళు తొడుక్కుని, చలిమంటకోసం, దుంగలు తేవటానికి కొట్టుగదికి వెళ్ళేవాడు.

ఒక్కొక్కప్పుడు, యింటికి తిరిగివచ్చేందుకు వేసుకున్న కాలిగుర్తులు శుభ్రంగా వుండటం వల్లనో లేక అనుకున్న దానికంటె ముందుగానే వేట పూర్తవుతేనో, పా పెంద

ర్నాళే యింటికి వచ్చేసేవాడు. అప్పుడు లారాతోనూ, మేరీ తోనూ ఆడుకునేందుకు ఎంతో వ్యవధి చిక్కేది.

వాళ్ళ ఆటల్లో పిచ్చికుక్క ఆటంటే పిల్లలకెంతో యిష్టం. తన గుబురైన, గోధుమరంగు జుత్తుని వేళ్ళతో పైకి రేపుకుని, చేతులు కిందపెట్టి, కుక్కకి మల్లే మొరుగుతూ, వాళ్ళను వెంటాడేవాడు పా. గదిమూలల్లో వాళ్లని పట్టుకునేందుకు ప్రయత్నించేవాడు.

వాళ్ళిద్దరూ కూడా చాలా తొందరగా తప్పించుకుని పరుగెత్తేవారు. కాని ఒక సారి మటుకు, చెక్కపెట్టె వెనకాతల వాళ్ళు దొరికిపోయారు. పా ని తప్పించుకు పోయేందుకు వాళ్లకి దారిలేకుండా పోయింది.

అప్పుడు పా కళ్లు పెద్దవిచేసి, నిజంగా కుక్కకి మల్లెనే మొరగటం ప్రారంభించాడు. మేరీ విపరీతంగా భయపడిపోయి, కదలకుండా నిలబడింది. పా దగ్గరగా వస్తూనే, లారా ఒక్క కేకపెట్టి, చెక్కపెట్టలోకి గంతేసి, మేరీని కూడా లోపలికి లాగింది.

ఒక్కసారి అంతా నిశ్శబ్దమయిపోయింది. పా తన నీలాల కళ్ళతో లారావంక చూస్తూ, "అరెరె! ఇన్నాళ్ళూ నువ్వు చిట్టి ద్రాక్షరసాని వనుకుంటున్నాను. ఫ్రెంచి గుర్రాని కున్నంత బలముందే నీకు!" అన్నాడు.

"పిల్లల్ని అలా హడల గొట్టకూడదు. చూడండీ! వాళ్లు ఎలా బిత్తరపోయి చూస్తున్నారో!" అన్నది మా. పా వాళ్లకేసి చూసి, వెంటనే తన సితార తీసి వాయిస్తూ, పాడటం మొదలెట్టాడు.

"యాంకీ డూడుల్ పట్నానికి వెళ్ళేడు,
గళ్ళ గళ్ళ లాగూ తొడుకున్నాడు,
ఆ ఊరంతా చూడలేననుకున్నాడు,
ఆ ఊళ్ళో ఎన్నో ఇళ్ళున్నాయి"

లారా, మేరీ, పిచ్చికుక్క విషయం పూర్తిగా మరిచి పోయారు.

"అప్పుడతనికి అక్కడ పెద్ద తుపాకులు
కనుపించాయి,
పెద్ద చెట్టు దుంగంతవున్నాయి ఆ తుపాకీలు,
వాటినితిప్పినప్పుడంతా,
రెండు ఆవుల మందల్ని తోలినట్లుంది,
వాటిని పేల్చినప్పుడంతా,
వాటి అంచునుంచి బోలెడంత పొగ వచ్చింది,
నాన్న తుపాకీ అంత చప్పుడు చేసింది అది,
ఎటు వచ్చీ శబ్దం చాలా ఎక్కువ."

పా కాలితో తాళంవేస్తూ పాడుతుంటే, లారా చేత్తో చప్పట్లు చరిచింది.

చలిలో, మంచులో ఆ చిట్టడివి మధ్యవున్న ఆ దుంగల యింట్లోమటుకు లోపల ఎంతో వెచ్చగా, హాయిగావుంది. పా, మా, మేరీ, లారా, చిన్ని చెల్లాయి కారీ, ముఖ్యంగా రాత్రిళ్ళు ఎంతో హాయిగా గడిపేవారు.

పొయిలో నిప్పు ధగ ధగ మెరుస్తోంది. తలుపులన్నీ వేసేసుకోటం వల్ల, బైట చలి, చీకటి, క్రూరమృగాల

బాధ, వాళ్లకి లేదు. జాకీకుక్క, నల్లపిల్లి నూసాన్ నేలమీద పడుకుని, చలిమంటకేసి గుడ్లు మిట కరిస్తూ చూస్తున్నాయి.

పా తన తిరుగుడు కుర్చీలో కూర్చుని, బల్ల మీద లాంతరు వెలుగులో కుట్టుకుంటోంది. ఆ లాంతరు బాగా శాంతివంతంగా వుంది. లాంతరు అడుగున కిరసనాయిలు పోసిన గాజు బుడ్డీలో, ఉప్పు, గుడ్డముక్కలు కుక్కి, కిరస నాయిలు బైటికి రాకుండా చేశారు.

మిల మిల మెరిసే దీపం, తెల్లగా తళ తళ లాడే గాజు చిమ్నీ, కిరసనాయిలు, ఆ లాంతరుకేసి చూడట మంటే లారాకెంతో సరదాగా వుండేది. అంతే కాదు; చలి మంటచూడటమన్నా లారాకి చాలా సరదా. ఆకుపచ్చ, ఎఱుపు, పసుపచ్చ రంగులు మారుతూ వెలిగే ఆ మంటనీ, బంగారుకణాల్లా వున్న బొగ్గు ముక్కలపైన, నీలిరంగులో ఆవిరైపోతున్న పొగనీ కళ్ళప్పగించి చూసేది లారా.

ఇక పా కథలు చెప్పటం ప్రారంభించేవాడు. కథ చెప్పమని లారా, మేరీ బ్రతిమాలిన తరువాత, వాళ్లని ఒళ్లో కూర్చోబెట్టుకుని, మీసాలు వాళ్ల మొఖాలకి తాకించి, వాళ్లని ఎంతో నవ్వించేవాడు. వాళ్లకేసి కొంటెగా, అల్లరిగా చూసేవాడు.

ఓ రాత్రి, పొయి ముందు నూసాన్ ఒళ్ళువిరుచుకు పడుకోవటం చూసి, "చిఱుత పులి కూడా పిల్లి అని మీకు తెలుసా? అదీ ఒక పెద్ద, క్రూరమైన పిల్లే" అన్నాడు పా. "ఊహూ" అంది లారా. "అబ్బే, నిజం! ఒక్కసారి మన నూసాన్, జాకీ కంటె పెద్దది అయి భయంకరంగా అర వటం ఊహించుకో. అప్పుడది సరిగ్గా చిఱుతపులికి మల్లేనే వుంటుంది" అన్నాడు పా.

లారానీ, మేరీనీ ఒళ్ళో కుదుటగా కూర్చోబెట్టుకుని, "మీకు తాతయ్యనీ, చిఱుత పులినీ గురించి చెబుతాను" అన్నాడు.

"నీ తాతయ్యా" అనడిగింది లారా.

"కాదు లారా. నీ తాతయ్య, అంటే మా నాన్న."

"ఓహో! అట్లాగా" అంటూ లారా, పా బుజందగ్గిరగా జరిగింది. లారాకి వాళ్ళ తాతయ్య తెలుసు. చిట్టడివిలో ఎక్కడో దూరాన, ఒక పెద్ద యింట్లో ఉండేవాడు తాతయ్య. పా కథ చెప్పటం ప్రారంభించాడు.

# తాతయ్య, చిఱుతపులి కథ

"ఒక రోజు మీ తాతయ్య పట్నానికి వెళ్ళి, పొద్దు పోయిన తరువాత యింటికి బయలుదేరాడు. ఆ చిట్టడివి మధ్య నుంచి గుఱ్ఱం ఎక్కి యింటికి తిరిగి వచ్చేటప్పుడు, బాగా చీకటి పడిపోయింది. దారికూడా సరిగ్గా కనపడనంత గాఢాంధకారమయిపోయింది చిట్టడివి అంతా. ఇంతలో ఒక చిఱుతపులి అరుపు విని, తాతయ్య గజగజ వణకటం ప్రారంభించాడు. ఎందుకంటే తాతయ్య దగ్గిర తుపాకీ లేదు."

"చిఱుతపులి ఎలా అరుస్తుంది?" అనడిగింది లారా.

"ఆడదానిలాగా యిలా కీచుగా అరుస్తుంది" అంటూ పా అరవగానే లారా, మేరీ భయపడిపోయారు. మా కూడా హడలిపోయి, కుర్చీలో ఒక్క గంతేసింది. కాని లారాకీ, మేరీకీ అలా భయపడటమంటే సరదాగా ఉండేది.

"తాతయ్య ఎక్కిన గుఱ్ఱంకూడా భయపడి, తొందరగా పరుగెత్తటం మొదలెట్టింది. కాని అది చిఱుతపులిని తప్పించుకోలేక పోయింది. ఆ చీకటిలో చిఱుతపులి తాతయ్యని వెంటాడింది. చాలా ఆకలిమీద ఉండటంవల్ల చిఱుతపులి గుఱ్ఱమంత వేగంగానూ పరుగెత్తింది. గుఱ్ఱాన్ని అంటిపెట్టుకుని, వెనకాతలే పరుగిడుతూ, చిఱుతపులి వుండివుండి అరవటం ప్రారంభించింది.

తాతయ్య గుఱ్ఱం జీనుమీదుగా వొంగి, గుఱ్ఱాన్ని ఇంకా వేగంగా పరుగెత్తమని తొందరచేశాడు. గుఱ్ఱం తన

శక్తినంతా ఉపయోగించి పరుగు తీయసాగింది. కాని చిఱుత పులికూడా అంత వేగంగానూ పరుగెత్తసాగింది. ఒక చెట్టు కొమ్మమీదనుంచి, ఒక చెట్టు మీదికి దూకుతూ, వెంటాడుతున్న ఆ చిఱుతపులిని తాతయ్య తల ఎత్తి ఓరగా చూడగలిగాడు. ఆ పులి చాలా పెద్దది. నల్లగావుంది. ఎలుకమీదికి దూకే నల్లపిల్లి నూసాన్‌కుమల్లె ఉంది. నల్లపిల్లికంటె చాలా రెట్లు పెద్దది. అది ఎంత పెద్దది అంటే, తాతయ్యమీదికి ఒక్కసారి దూకిందంటే, తన మొనదేలిన పొడుగాటి పళ్ళతోనూ, వేళ్ళ గోళ్ళతోనూ, తాతయ్యని చంపేయగల్గినంత పెద్దది. సరిగ్గా పిల్లి దగ్గరనుంచి పరుగెత్తికెళ్ళే ఎలుకలాగ, తాతయ్య ఆ చిఱుతపులి దగ్గరనుంచి పరుగులెత్తజొచ్చాడు.

చిఱుతపులి అరవటం మానేసింది. తాతయ్యకి ఆ తర్వాత అది కనుపించనుకూడా లేదు. కాని అది తనని వెంటాడుతోందని తాతయ్యకి తెలుసు. గుర్రం పరుగెస్తూయింకా పోడుతీస్తూనే ఉంది.

చిట్టచివరికి గుర్రం తాతయ్య యింటివరకూ వచ్చేసింది. గుర్రంమీంచి ఒక్కదూకు దూకి గుమ్మంవైపు పరుగెత్తాడు తాతయ్య. లోపలికి దూరి, వెనకాతలే తపీమని తలుపు బిడాయించాడు. చిఱుతపులి సరిగ్గా తాతయ్య కూర్చున్న చోట, గుర్రం వీపుమీదికి దూకింది.

గుర్రం ఒక్క కేక పెట్టి, పారిపోసాగింది. చిఱుతపులి తన గోళ్ళతో వీపు గీరుతుంటే, గుర్రం చిట్టడివిలోకి పరుగెత్తింది. కాని తాతయ్య గోడకు ఉన్న తుపాకీని ఒక్కుమ్మడిన లాగి, కిటికీ దగ్గరకి పరుగెత్తి, చిఱుతపులిని కాల్చేశాడు. తాతయ్య ఆ తర్వాత మరెప్పుడూ తుపాకీ లేకుండా చిట్టడివికి వెళ్ళలేదు."

పా ఈ కథ చెబుతుంటే, లారా, మేరీ భయపడి, పా కి దగ్గరగా జరిగి కూర్చున్నారు. పా బలమైన చేతుల్లో అతని వొళ్ళో వెచ్చగా కూర్చునుండటంవల్ల వాళ్లకి కాస్త భయం తగ్గింది.

ఒక పక్కగా నల్లపిల్లి, దాని పక్కన జాకీ పడుకు నుంటే, చలిమంట దగ్గర కూర్చునుండటం వాళ్ళకెంతో సర దాగా ఉండేది. బైట తోడేలు అరుపు వింటూనే, జాకీ తల ఎత్తి చూసేది. దాని ఒంటిమీద వెంట్రుకలన్నీ లేచి నిలుచు నేవి. కాని చిట్టడివిలో, ఆ చలిలో, చీకట్లో తోడేలు అరుపు వినిపిస్తే లారాకీ, మేరీకీ భయమేమీ లేదు.

ఇంటిచుట్టుతా మంచు ధారాపాతంగా కురుస్తూనే ఉండేది. తలుపులు వేసి ఉండటంవల్ల లోపలికి రాలేనందుకు గాలి మూలుగుతున్నదా అన్నట్లు హోరుమని వీచేది. కాని దుంగలతో కట్టిన ఆ చిన్న యింట్లో వాళ్ళకి ఎంతో వెచ్చగా హాయిగా ఉండేది.

• • •

రోజూ సాయంత్రం కథలు చెప్పేముందు పా మర్నాడు వేటకోసం తుపాకీ గుండ్లు తయారుచేసేవాడు.

లారా, మేరీ పా కి సాయంచేసేవారు. ఒక పొడుగాటి గరిటె, సీసపు రేకులతో నిండిన ఒక డబ్బా, గుండ్లు అచ్చు పోసేది, యివన్నీ పా కి అందించేవారు లారా, మేరీ. పా ఆ గుండ్లు చేస్తూంటే, వాళ్ళిద్దరూ చెరొకపక్కా కూర్చుని ఆదంతా చూసేవారు. నిప్పులో ఆ పొడుగాటి గరిటెని పెట్టి, సీసపు రేకుల్ని కరగబెట్టేవాడు పా. అవి కరిగినతర్వాత, గరిటె జాగ్రత్తగా తీసి, గుండ్లు అచ్చుపోసే పాత్రకున్న

చిల్లిలో పోసేవాడు. ఒక్క క్షణముండి, ఆ పాత్ర తియ్యగానే, తుపాకీగుండు కిందపడేది.

వేడిగా ఉండటంవల్ల, ఆ గుండుని ముట్టుకునేందుకు వీలుండేది కాదు. కాని ఉండబట్టలేక లారా, మేరీ దాన్ని ముట్టుకు చూసేవారు. కొత్త గుండుని ముట్టుకోవద్దని పా చెబుతున్నా వినిపించుకునేవారు కాదు. అందుకని వేళ్ళు కాలినాకూడా ఏమీ అనేవారు కారు. మరి వేళ్లు కాలాయంటే అది వాళ్ళతప్పే! పా మాటలు ఎందుకు వినిపించుకోకుండా పోవాలి మరి! ఆ కాలిన వేళ్లు చల్లబడేందుకు వెంటనే నోట్లో కుక్కుకుని, పా గుండ్లు చేయటం చూస్తూ కూర్చునేవారు.

పా ఆ గుండ్లు చేయటం పూర్తయేటప్పటికి, పొయ్యి మీద ఓ కుప్ప సీసపు రేకులు తయారయేవి. కాస్సేపు చల్లారబెట్టిన తర్వాత, అచ్చుపోసే పాత్రలో మిగిలిన రేకు ముక్కలన్నిటినీ కత్తితో ముక్కలు చేసేవాడు పా. మళ్ళీ గుండ్లు చేసేటప్పుడు కరగబెట్టేందుకు ఆ ముక్కలని జాగ్రత్తగా పోగుచేసేవాడు. గుండ్లు చేయటం పూర్తవగానే, వాటిని తన చిన్న గుండ్ల సంచీలో వేసుకునేవాడు. పా అంతకుక్రితం ఒక కుందేలుని చంపాడు. ఆ కుందేలు చర్మంతో మా ఒక చిన్న గుండ్లసంచీ తయారుచేసింది.

ఆ తర్వాత గోడనున్న తుపాకీ తీసి శుభ్రంచేసేవాడు పా. పగలంతా మంచు కురుస్తున్న చిట్టడివిలో ఉపయోగించటంవల్ల, తుపాకీ కొద్దిగా తడిగా వుండేది. బూడిద పేరుకునుండటంవల్ల తుపాకీ లోపలకూడా శుభ్రం చేయవలసి వచ్చేది.

అందుకని, తుపాకీలోంచి తుపాకీ గజాన్ని తీసి, దాని అంచున ఒక శుభ్రమైన గుడ్డ పేలిక కట్టేవాడు. తుపాకీ బరువు భాగాన్ని ఒక పళ్లెంలో పెట్టి, టీ పాత్రలోలోంచి

ఆ తుపాకీలోకి వేడినీళ్లు పోసేవాడు. వెంటనే తుపాకీ గజాన్ని లోపలికి పోనిచ్చి, పైకీ, కిందికీ లాగేవాడు. లోపల మసిలో నల్లనయిన వేన్నీళ్ళన్నీ తుపాకీ మూతిలోంచి పైకి చిమ్మేవి. తుపాకీని గుండ్లలో నింపినప్పుడు, ఆ చిన్న మూతను బిగించేవాడు పా.

లోపల నీళ్ళన్నీ పూర్తిగా పైకి వచ్చేసేంతవరకూ, లోపల నీళ్ళు పోస్తూ, తుపాకీ గజంతో శుభ్రంచేసేవాడు. తుపాకీలోని వేడిపడిన యినుము కరిగిపోకుండా, వేన్నీళ్ళు ఆపకుండా పోస్తూనే ఉండవలసి వచ్చేది. చివరికి తుపాకీ శుభ్రమయేది.

ఆ తర్వాత, నూనెలో ముంచిన ఒక పాత గుడ్డని తుపాకీ గజానికి చుట్టి, తుపాకీ యింకా వేడిగా ఉండగానే, దాని లోపలంతా నూనె పూసేవాడు. మరొక శుభ్రమైన గుడ్డని నూనెలోముంచి, తుపాకీ నిగనిగలాడేంతవరకూ, దాని పైనంతా నూనె పూసేవాడు. ఆ తర్వాత తుపాకీ మొత్తం తళతళ మెరిసిపోయేటట్లు, నూనె రాసేవాడు.

ఇక ఆ తుపాకీని గుండ్లతో నింపే పనిలో లారా, మేరీ సాయం చేయవలసి వచ్చేది. పా చాలా పొడుగ్గా ఉండేవాడు. ఆ తుపాకీ చేతిలో పట్టుకుని, నిటారుగా నిలబడి, అటూ యిటూ నిలబడ్డ లారా, మేరీలని చూసి, "ఇప్పుడు చెప్పండి. నేను ఎలా ఉన్నాను?" అనేవాడు. వాళ్ళిద్దరూ అతన్ని చాలా జాగ్రత్తగా పరీక్షించేవారు. కాని అతనిలో ఒక్క తప్పుకూడా కనుపించేది కాదు.

అప్పుకొమ్ములో పోసిన తుపాకీ మందుని అతనికి అందించేది. లారా ఆ కొమ్ముకి లోహంతో చేసిన చిన్న మూత వుండేది. ఆ కొమ్మునిండా తుపాకీ మందు పోసి, తుపాకీలోకి పోసేసేవాడు. పా తర్వాత తుపాకీ మందు

అంతా ఆడుక్కి వెళ్ళిందో లేదో అని తుపాక్కిని కొద్దిగా కదిలించి చూసేవాడు.

తర్వాత "నా చిన్న డబ్బా ఏది?" అనడిగేవాడు. నూనెలో ముంచిన గుడ్డపేలికలున్న చిన్న రేకు డబ్బాని అతనికి అందించేది మేరీ. పా ఒక గుడ్డపేలిక మీద కొత్తగా తయారుచేసిన ఆ గుండ్లని పెట్టి తుపాకి గజంతో వాటిని తుపాకి లోపలికి తోసేవాడు. ఆ తర్వాత వాటిని తుపాకి మందు మీద వేసి కొట్టేవాడు. తుపాకి గజంతో లోపలికి కొడుతుంటే, అది పైకి వచ్చేసేది. పా దాన్ని మళ్ళీ బలంగా లోపలికి తోసేవాడు. అలా చాలాసేపు చేసేవాడు.

ఆ తర్వాత తుపాకి గజాన్ని దాని స్థలంలో పెట్టేశే వాడు. ఒక పెట్టెలోంచి చిన్న చిన్న బిళ్ళని తీసి తుపాకి ఆడుగున జాగ్రత్తగా పెట్టేవాడు ఆ విధంగా తుపాకి తయారవగానే దాన్ని గోడనున్న మేకుకి తగిలించేవాడు.

పాయింట్లో వున్నప్పుడు గుమ్మంపైన రెండు కొయ్య మేకులకి తగిలించి వుండేది ఆ తుపాకి. ఒక పచ్చని కర్రని కోసి ఆ మేకుల్ని తయారు చేశాడు పా. దుంగలోకి బాగా లోతుగా రెండు చిల్లులు చేసి వాటిని అందులోకి దోపాడు. పైకి వంపులు తిరిగున్న ఆ మేకులకి తగిలిస్తే, తుపాకి కింద పడకుండా భద్రంగా వుండేది.

ఏ సమయంలోనైనా, అవసరమొచ్చినప్పుడు ఉపయోగించేందుకు వీలుగా వుండేందుకని ఆ తుపాకి నిండా ఎప్పుడూ గుండ్లు వేసి వుంచేవాడు.

చిట్టడవిలోకి వెళ్ళేముందు ఎప్పుడూ పా తుపాకి నిండా గుండ్లున్నాయో లేవో, తన జేబులో చిన్న రేకు డబ్బా, తలిమ్మాల్ల వస్తువులూ ఉన్నాయో లేవో జాగ్రత్తగా చూసుకునేవాడు. నడుంకి కట్టుకున్న తోలు పటకాకి ఒక

చిన్న గొడ్డలినీ, తుపాకి మందు వేసిన కొమ్మునీ తగిలించుకునే వాడు. గుండ్లతో నిండిన తుపాకిని బుజాన వేసుకునేవాడు. ఒకసారి తుపాకిని పేల్చగానే మళ్ళీ వెంటనే తుపాకిలో గుండు పెట్టేవాడు. సమయానికి తుపాకిలో గుండ్లు అయిపోయి, అవస్థ పడకుండా వుండేందుకని అలా చేస్తానని చెప్పేవాడు పా.

క్రూర మృగాన్ని దేన్నయినా చంపగానే, ఆ తుపాకిలో ఎంత మందువుందో దాన్ని కదిలించి చూసి, కొత్త గుండు పెట్టి మరీ కాల్చడానికి ఉపక్రమించేవాడు పా. ఎలుగుబంటిని కాని, చిఱుతపులిని గాని అయతే, ఒక్క గుండుతో కాల్చవలసి వచ్చేది. అలా కాకుంటే దెబ్బతిన్న జంతువు, వేటకాడు మళ్ళీ గుండు పెట్టుకునేలోపున అతన్ని చంపేయగలదు. కాని పా ఒంటరిగా చిట్టడవికి వెళ్ళినప్పుడు లారా, మేరీ భయపడేవారు కాదు. పా ఒక్క దెబ్బతో చిఱుతపులులనీ, ఎలుగుబంట్లనీ చంపేస్తాడని వాళ్ళకి తెలుసు.

తుపాకి గుండ్లని తయారుచేసి, తుపాకిలో నింపేసిన తర్వాత కథలు చెప్పుకునేవారు. "అడవిలో కంఠం" గురించి చెప్పమని లారా పాని బ్రతిమాలింది. పా కళ్ళు చిట్లించి, "ఛ! ఛ! నేను అల్లరి పిల్లాడిగా వున్నప్పుడు జరిగిన సంగతులు మీకు వినాలని వుందా?" అన్నాడు. అవును వినాలని వుంది" అంటూ లారా, మేరీ ప్రాధేయపడితే పా యిలా ప్రారంభించాడు.

"నేను అప్పుడు బాగా చిన్నవాణ్ణి. దాదాపు మేరీ అంత వుండేవాణ్ణి. రోజూ మధ్యాహ్నం అడవికి వెళ్ళి, ఆవుల్ని యింటికి తోలుకువచ్చేవాణ్ణి. చీకటి పడకముందే ఆవుల్ని వేగంగా తోలుకువచ్చేయమని, తోవలో ఎప్పుడూ తాచ్చారం చెయ్యొద్దని, అక్కడ ఎలుగుబంట్లూ, తోడేళ్లూ, చిఱుతపులులూ వుంటాయని చెప్పాడు నాన్న.

ఒకరోజు శాస్త్రిపెందరాళే యింటిదగ్గిరనుంచి బయలు దేరాను. ఇంకా చాలా పొద్దువుంది, అవసరంగా తిరిగి వెళ్ళక్కర లేదనుకున్నాను. అడవిలోని వింతలన్నీ చూస్తూ చీకటి పడిపోతోందనే విషయమే మరిచిపోయాను. చెట్ల మీదా, ఆకులమీదా వున్న వుడతల్నీ, పైట పచ్చికమీద ఆడుకుంటున్న కుందేలు పిల్లల్నీ చూస్తూ ఎంతోసేపు గడిపేశాను.

అవన్నీ క్రూర మృగాలు లాగ ఊహించుకుంటూ అడవిలో ఆడుకోవటం ప్రారంభించాను. ఆ చిట్టడవినిండా క్రూరమైన మనుష్యులున్నట్లూ, నేను ఒక్కణ్ణే యోధుడిలా వాళ్ళతో యుద్ధం చేస్తున్నట్లూ, ఆడుకుంటున్నాను. ఇంతలో ఉన్నట్లుండి ఆకాశాన పక్షులు కీచు కీచుమంటూ తమ తమ గూళ్ళకి వెళ్ళిపోవటం కనుపించింది. ఇటు చూద్దును కదా అడవి అంతా దారి తెలియనంత చీకటయి పోయివుంది.

బాగా చీకటి పడిపోకముందే ఆవుల్ని జాగ్రత్తగా యింటికి చేర్చాలని నాకు తెలుసు. కాని ఆవులు నాకు కనపడితేగా? చెవులు రిక్కించుకుని వినినా ఆవుల మువ్వల చప్పుడు నాకు వినిపించలేదు. గట్టిగా కేకలు పెట్టి పిలిచినా ఆవులు రాలేదు.

చీకటన్నా, క్రూరమృగాలన్నా నాకు తగని భయం. కాని ఆవులు లేకుండా యింటికి తిరిగి వెళ్ళటానికి నాకు ధైర్యం లేకపోయింది. అందుకని ఆ అడవంతా గట్టిగా కేకలేస్తూ ఆవులకోసం వేట ప్రారంభించాను. పోను పోను చీకటి ఎక్కువైంది. ఎంత నడిచినా తరక్కుండా అడవి యింకా పెరుగుతున్నట్లే అనిపించింది. చెట్లు, ఆకుల గుబుర్లు ఏదో కొత్తగా వింతగా తోచాయి.

ఎక్కడా నాకు ఆవులు కనుపించలేదు. కొండలు ఎక్కి వాటికోసం వెదికాను. చీకటిగా వున్న కొండ లోయల్లోకి వెళ్ళి వాటికోసం కేక వేశాను. ఎక్కడైనా ఆవుల మువ్వల చప్పుడు వినబడుతుందేమోనని చెవులు రిక్కించుకుని విన్నాను. కాని చెట్ల ఆకుల గరగర తప్ప యింకేమీ వినపడలేదు.

ఇంతలో ఎవరో పెద్దగా ఊపిరి పీల్చిన చప్పుడు విని పించింది. క్షణంపాటు ఆ చీకట్లో నా వెనకాల ఒక చిఱుత పులి వుందనుకున్నాను. కాని నేను ఊపిరి తీసుకున్న శబ్దం విని అలా వుత్తినే భయపడ్డాను.

నా కాళ్ళకి జోళ్ళు లేవు. చెట్ల కొమ్మలమధ్య నుంచి పరుగెత్తటంవల్ల నా కాళ్లు బాగా గీసుకు పోయాయి. కాని "సుక్కీ!" అని కేక లేస్తూ ఆవులకోసం వెతుకుతూనే వున్నాను. శక్తినంతా కూడా తీసుకుని "సుక్కీ!" అని గట్టిగా కేక పెట్టాను. సరిగ్గా నా తలపైన ఓ కంఠం "ఎవరు?" అనడిగింది. భయంతో నా తల వెంట్రుకలన్నీ ఒక్కసారి లేచి నిలబడ్డాయి. "ఎవరు? ఎవరు?" అని మళ్ళీ అడిగింది కంఠం. అబ్బ! నేను అప్పుడు ఎలా పరుగెత్తాననుకున్నారు! ఆవుల విషయము దేవుని కెరుక! ఎప్పుడెప్పుడు చీకటిగా వున్న చిట్టడవిలోంచి యింట్లో పడదామా అనే ఆలోచన ఒక్కటే నన్ను వేధించ సాగింది. చీకట్లో ఆ కంఠం 'ఎవరు?' అని యింకా నన్ను అడుగుతూనే వుంది.

ఎంత వేగంగా పరుగెత్తానో చెప్పలేను. అయాసంతో రొప్పటం ప్రారంభించాను కాని పరుగు ఆపలేదు. ఏదో కాలికి తగిలినట్లయి కింద పడ్డాను కాని ఒక్క దూకు దూకి మళ్ళీ పరుగు తీయసాగాను. తోడేలుకు కూడా అందనంత వేగంగా పొడు తీశాను.

చిట్ట చివరికి, ఆ అడవినుంచి బైట పడ్డాను. గాడి బైట ఆవులన్నీ కాచుకుని వున్నాయి. వాటిని లోపలికితోలి, యింటికి పరుగెత్తాను.

నాన్న తల ఎత్తి "ఇంతసేపు ఏం చేస్తున్నావు! తోవలో ఆడుకుంటున్నావా?" అన్నాడు. నా కాళ్ళవంక చూసుకునేటప్పటికి బొటనవ్రేలి గోరు పూర్తిగా ఊడిపోయి వుండటం కనుపించింది. ఆ భయంలో గోరు ఊడిపోయిన బాధకూడా తెలియలేదు నాకు."

"చెప్పు పా! ఊ చెప్పు." అని లారా అడిగేంత వరకూ పా కథ చెప్పటం ఆపేశాడు.

"సరే! ఇక అప్పుడు మీ తాతయ్య పెరట్లోకి వెళ్ళి ఒక లావుపాటి బెత్తం తీసుకువచ్చి, నా వీపు పగలకొట్టాడు. "నేను ఏదైనా ఒక పని చెయ్యమన్నానంటే, దానికి తగినంత కారణముంటుంది. చెప్పినమాట వినక పోవటానికి నువ్వేమి పనివాడివి కాదు. తొమ్మిదేళ్ళ కుర్రాడివి. జాగ్రత్త!" అంటూ గదిమాడు తాతయ్య. "ఆ తర్వాత తాతయ్య ఏమన్నాడు?" అంది లారా అతని ఒళ్ళో సంతోషంతో ఊగిపోతూ "నేను చెప్పినమాట వినివుంటే చీకటి పడిన తరువాత చిట్టడవిలో వుండిపోయేవాడివి కాదు. గుడ్లగూబని చూసి భయపడే వాడివి కాదు" అన్నాడు.

# 2

క్రిస్మస్ సమీపిస్తున్నది. ఆ చిన్నయింటినంతా మంచు కప్పేసింది. ఇంటి గోడలకు, కిటికీల దగ్గర మంచు దట్టంగా పేరుకుపోయింది. పొద్దుట పా. తలుపు తెరవగానే, లారా అంత ఎత్తున మంచు ఒక గోడకి మల్లె కనుపించేది. పార తీసుకుని, ఆ మంచునంతా పక్కకి తోస్తూ, ఆవులు, గుఱ్ఱాలున్న గాదెకి ఒక త్రోవ చేసేవాడు పా. ఆ గాదెలో అవి ఎంతో వెచ్చగా పడుకునుండేవి.

పగలు మంచులేకుండా, బాగా వెలుగ్గా వుండేది. కిటికీల దగ్గర కుర్చీలేసుకుని నిలబడి, బైట మంచునంతా, చెట్లనంతా చూసేవారు లారా, మేరీ. నల్లని చెట్లకొమ్మల చుట్టూ మంచు పేరుకునుండేది. ఎండలో అది ధగ ధగ మెరిసిపోయేది. ఇంటికప్పు అంచునుంచి, పెద్దపెద్ద మంచు బొట్లు కిందికి వేళ్ళాడుతుండేవి. గాజువలె మెరుస్తున్న ఆ బొట్లు చాలా పెద్దవిగానే వుండేవి. గాదె దగ్గరనుంచి వస్తుంటే, పా పీల్చే ఊపిరి తెల్లటి మబ్బులకి మల్లె గాలిలో కలిసిపోయి, గడ్డం మీదా మీసాల మీదా, మంచులా కనుపిస్తున్నాయా అనిపించేది.

జోళ్ళనుంచి మంచు దులుపుకుంటూ యింట్లోకి రాగానే, పా లారాని కావలించుకుని ముద్దాడేవాడు. అతని పెద్దకోటు చల్లగా వుండేది.

ప్రతిరోజూ రాత్రి, ఒక పెద్దకొయ్య పలకనీ, రెండు చిన్న చిన్న పలకలనీ తీసుకుని పనిప్రారంభించేవాడు పా. ముందు కత్తితో వాటిని కొట్టి, అరచేతితో బాగా రుద్దే వాడు. లారా చేత్తోముట్టుకు చూస్తే అవి సిల్కు అంత నున్నగా వుండేవి.

తర్వాత తన వాడిదైన కత్తి తీసుకుని, పలక అంచుల్ని, చిన్న చిన్న కొండలు, గోపురాలు ఆకారంలో చెక్కేవాడు. పలక పై భాగంలో నక్షత్రా కారంలో చెక్కేవాడు. పలక మధ్యనంతా, కిటికీలు, చిన్న చిన్న నక్షత్రాలు, చందమామలు, ఆకారంలో సందులు చేసేవాడు. వాటిచుట్టూతా ఆకులు, పక్షులు చెక్కేవాడు.

చిన్న పలకలలో వొకదానిని, చక్కని వంపుల ఆకారంతో తయారుచేసి, దాని అంచుల్ని ఆకులు, పువ్వులు, నక్షత్రాలు చెక్కాడు. అన్నిటిలోకి చిన్న పలక అంచున ఓ చిన్న ద్రాక్షపళ్ళ గుత్తిని చెక్కాడు

తన మనసుకి ఎలావుంటే అందంగా తోస్తుందో అలాగ, ఆ చిన్న చిన్న కత్తిరింపులని, చెక్కడాలని ఎంతో నెమ్మదిగా, జాగ్రత్తగా చేసేవాడు.

చిట్టచివరికి ఆ పని పూర్తిచేసి, ఓ రోజు రాత్రి ఆ మూడు పలకలని కలిపి బిగించాడు. ఆ పెద్ద పలక

మధ్యన చిన్న అలమారు తయారయింది. పలకపైన నక్షత్రం అందంగా అమరింది. వంపులుగా చెక్కిన పలక, దాని అడుగున పెట్టబడింది. అలమారు అంచున చిన్న ద్రాక్షపళ్ల పలకని బిగించాడు. క్రిస్‌మస్‌కి మాకు బహుమతిగా దాన్ని తయారుచేశాడు పా. కిటికీల మధ్య గోడకి దాన్ని ఎంతో జాగ్రత్తగా తగిలించాడు. ఆ చిన్న అలమారులో తన చైనా స్త్రీ బొమ్మ పెట్టుకుంది మా.

ఆ చిన్న చైనా స్త్రీ బొమ్మకి తలమీద టోపీ వుండేది. మెడమీద ఉంగరాలజుత్తు వేళ్లాడుతుండేది. ముందు లేసు అల్లిన లేతగులాబీ రంగు గౌను, కాళ్లకి బంగారు తీగలున్న జోళ్లు వుండేవి. చట్రూ, ఆకులు, పక్షులు, చందమామల బొమ్మలతో, పైన పెద్ద నక్షత్రాకారంగల బొమ్మతో, అలమారులో నిలబడిన ఆ చైనా స్త్రీ చూడ ముచ్చటగా వుండేది.

ఆ రోజంతా క్రిస్‌మస్ పిండివంటలు చేయడంలో అమ్మకి క్షణం తీరికలేదు. ఉప్పుజల్లిన రొట్టె, స్వీడన్ దేశపు రొట్టెముక్కలు, ఉప్పులో ఊరేసిన పందిమాంసం, ఒక పెద్ద గాజు కూజానిండా ఆపిలు రసం, ద్రాక్షరసం, రకరకాల పిండివంటలు చేసింది మా. కేకుచేసిన గరిటెని మట్టుకు లారాని, మేరీని రుచిచూడ నిచ్చింది.

ఒకరోజు పొద్దున్న చెఱుకురసాన్ని వేడిచేసి దానిలో చక్కెర కలిపి, చిక్కని పానీయంలా తయారుచేసింది. పా బైటనుంచి రెండు పళ్ళాలనిండా, శుభ్రమైన తెల్లని మంచు గడ్డలు తీసుకు వచ్చాడు. లారా, మేరీ చెరి ఒక పళ్ళెం తీసుకున్నారు. ఆ చిక్కని చెఱుకురసాన్ని మంచుగడ్డల

మీద చుక్కలు చుక్కలుగా పోయటమెలాగో చూపించారు పా, మా.

బొట్లు బొట్లుగా పడ్డ ఆ చెరుకు రసం ఉన్నట్లుండి గడ్డకట్టుకుపోయి, కలకండలా తయారయింది. లారా, మేరీ ఒక్కొక్క ముక్క తిని, తతిమ్మాది క్రిస్మస్‌కి అట్టేపెట్టారు. పీటర్ మామ, ఎల్జా అత్త, వాళ్ళ పిల్లలు పీటరు, ఎలీసు, క్రిస్మస్ వేడుకకి వాళ్ళింటికి వస్తారు కాబట్టి అన్ని పిండి వంటలు చేశారు.

రేపు క్రిస్మస్ అనగా వాళ్లంతా వచ్చారు. లారాకి, మేరీకి ముందు చిన్నగానూ, తర్వాత పెద్దగానూ గజ్జలచప్పుడు వినిపించింది. తర్వాత చిట్టడవిలోంచి పెద్ద గుర్రంబండి యింటిముందు వచ్చి ఆగింది. ఎనుంపోతు తోళ్ళు, దుప్పట్లు కప్పుకుని, అందులోంచి అతిథులు దిగారు. బోలెడన్ని కోట్లు, శాలువలు, ముసుగులు కప్పుకున్న వాళ్ళు చూడటానికి పెద్ద పెద్ద మూటలల్లే వున్నారు.

వాళ్ళు లోపలికి రాగానే, ఆ చిన్నయిల్లంతా జనంతో నిండి, కిటకిట లాడిపోయింది. నల్ల పిల్లిగాదెలోకి వెళ్ళి దాక్కుంది. కాని ఆడుకుందుకు కొత్త పిల్లలు రావటం వల్ల జాక్‌గంతులేస్తూ ఒకటే మొరగటం ప్రారంభించింది. ఎల్జా, అత్తపైన దుప్పటి తీసేసింది. పిల్లలంతా పెద్దగా కబుర్లు చెప్పుకుంటూ, పరుగెత్తుతూ, అల్లరి ప్రారంభించారు. అత్త వాళ్లని అల్లరిచెయ్యకుండా నెమ్మదిగా వుండమని చెప్పింది. అప్పుడు ఎలీస్, "నేను చెప్పనా ఏం చేద్దామో! మనం బొమ్మలు చేసుకుందాం." అంది.

బొమ్మలు చేయటానికి బైటికి వెళ్ళాలి అంది ఎలీసు. బైట చాలా చలిగా వుండటంవల్ల లారాని ఆడవద్దంది మా.

కాని లారా బిక్కముఖం వెయ్యటం చూసి కాస్సే పు మటుకు ఆడుకుంరమ్మంది. లారాకి ఒక కోటు, చేతిమేజోళ్లు తొడిగి, తలమీద టోపీ పెట్టి, మెడలో మఫ్లర్ చుట్టి, బైటికి వెళ్లనిచ్చింది.

ఆ రోజంతా లారా బలే సరదాగా ఉంది. ఆరుబైట మంచులో ఎలీస్, ఎల్లా, పీటర్, మేరీలతో కలసి ఒకటే ఆటలు ఆడుకుంది.

వాళ్లు బొమ్మలు చేసుకునే ఆట యిలా ఆడుకునేవారు. ఒక్కొక్కరే చెట్టుకొమ్మమీదికి ఎక్కి, చేతులు ఎడంగా పెట్టి, పైనుంచి కిందకి మెత్తని మంచులోకి ధభీమని దూకే వారు. మంచులో బోర్ల పక్కలా పడేవారు. తర్వాత మంచులో పడిన గుర్తులు చెదరకుండా, జాగ్రత్తగా లేచి నిలబడేవారు. అలా జాగ్రత్తగా లేవగలిగితే మంచులో వాళ్ళ ఆకారం మొత్తం, చేతులు కాళ్ళతోసహా పడేది. వాటినే వాళ్లు తమ బొమ్మలనేవారు.

పగలంతా అలా ఆడిఆడి, రాత్రయేటప్పటికి ఆ సంతో షంలో సరిగా నిద్రపోయేవారు కాదు. కాని వాళ్లు నిద్ర పోక తప్పేది కాదు. అందుకని కాలి మేజోళ్ళు పొయి పక్కన పెట్టి, ప్రార్థన చేసుకుని పడుకునేవారు పిల్లలంతా. అంటే ఎల్లా, మేరీ, ఎలీస్, లారా కలిసి కింద ఓ పెద్ద పక్క పరుచుకుని, పడుకునేవారు. పీటర్ చిన్న మంచంమీద పడు కునేవాడు. మామయ్యా, అత్తయ్యా పెద్ద మంచంమీద. పా, మా వంట గదిలో మా పడుకునేవారు. అందరికీ సరిపోయే ట్టు మామయ్యా బండీలోంచి మరికొన్ని దుప్పట్లు, శాలువలు తీసుకువచ్చేవాడు.

పెద్దవాళ్లంతా పొయిచుట్టూ కూర్చుని కబుర్లు చెప్పు కుంటున్నారు. లారాకి నిద్రవచ్చి కునుకుపడుతున్న సమయా నికి, పీటర్ మామయ్య, "మొన్న ఏమయిందో తెలుసా? ఎల్జాకి కాస్తలో పెద్ద ప్రమాదం జరిగేది. నేను అప్పుడు లేక్ సిటీకి వెళ్ళాను. నా పెద్దకుక్క ప్రిన్సు మీకు తెలుసు కదూ? మరేం..."

లారా ఒక్కసారి కళ్ళు తెరిచింది. కుక్కల సంగతి వినటమంటే ఆ చిన్నారికి చాల యిష్టం. ఎలుకకిమల్లె కదల కుండా పడుకుని, గోడలమీద పడుతున్న ఆ మంట వెలుగుని చూస్తూ, మామయ్య కథ విన్నది లారా.

"ఒకరోజు పొద్దున్నే కుండతో నీళ్లు తెచ్చేందుకని, ఏటిదగ్గిరకి వెళ్ళింది ఎల్జా. ఏటికి పోయే దారిలో ఉన్న లోయ దగ్గిరకి వెళ్లేటప్పటికి, ఉన్నట్లుండి ప్రిన్సు ఎల్జా గౌను పట్టుకుని గుంజటం ప్రారంభించింది. ప్రిన్సు బాగా పెద్ద కుక్కనే విషయం మీకు తెలిసిందేగా! ఎల్జా ఎంత కోప్ప డినా అది పట్టు విడవలేదు. కుక్క బాగా బలంగా, పెద్దగా ఉండటంవల్ల ఎల్జా దాన్ని విడిపించుకోలేకపోయింది. పళ్లతో పట్టుకు వెనక్కి గుంజి గుంజి, చివరికి గౌను చింపేసింది. "అది నా నీలంపూలగౌను" అంది ఎల్జా. "అబ్బ!" అంది మా. "సరిగ్గా గౌను వెనకాల ఓ పెద్ద ముక్క చింపే సింది. దాన్ని చావబాదేయాలన్నంత పెల్లికోపమొచ్చింది నాకు. కాని కుక్క పళ్లు పైకి పెట్టి మొరగటం ప్రారంభిం చింది. "ప్రిన్సు నిన్ను చూసి మొరిగిందా?" అన్నాడు పా.

"అవును." అన్నది అత్తయ్య. "అత్తయ్య మళ్ళీ ఏటివైపు నడవటం ప్రారంభించింది. కాని ప్రిన్సు ముందుకి దూకి, అత్తయ్య దారికడ్డంగా నిలబడి, మొరగటం ఆపలేదు. అత్తయ్య కేకలనీ, బెదిరింపులనీ లెక్కచెయ్యలేదు ప్రిన్సు.

పళ్ళు బైటపెట్టి మొరుగుతూనే ఉంది. అత్తయ్యని ఒక్క అడుగు ముందుకి వెయ్యనీయకుండా, అడ్డుతగిలింది. దాంతో అత్తయ్యకి భయమేసింది. "అబ్బ! భయమెయ్యక ఏమవుతుంది మరి!" అన్నది మా. "కుక్క ఎంత వికృతంగా మొరిగిందంటే నిజంగా నన్ను కరిచేస్తుంది అనుకున్నాను" అంది అత్తయ్య. "అబ్బ! అటువంటిది నేను ఎక్కడా వినలేదు. ఇంతకీ నువ్వేం చేశావు?" అనడిగింది మా. "వెనక్కి తిరిగి ఒక్క పరుగున యింట్లోకి దూరి తలుపు వేసేశాను" అని సమాధానమిచ్చింది అత్తయ్య. "సామాన్యంగా కొత్తవాళ్ళు వచ్చినప్పుడే ప్రిన్సు మొరుగుతుంది. పిల్లలదగ్గిర అది చాలా సౌమ్యంగా ఉండేది. అందుకని యింటిదగ్గిర దాన్ని వదిలిపెట్టి వెళ్ళటానికి నేను ఏమీ జంకేవాణ్ణి కాదు. కుక్క ఎందుకలా చేసిందో ఎట్లాకేమాత్రం బోధపడలేదు. ఇంటికి వచ్చేసిన తర్వాతకూడా, తలుపు కవతల నిలబడి మొరుగుతూనే ఉంది ప్రిన్సు. ఎట్లా తలుపు తియ్యటానికి ప్రయత్నించినప్పుడల్లా, మీదపడి భోంయ్యిమంది. "పిచ్చెక్కిందా ఏమిటి?" అనడిగింది మా. "నేనూ అలాగే అనుకున్నాను. నాకు ఏమీ పాలుపోలేదు. బయటికి రావటానికి భయపడి, పిల్లలతో లోపలే తలుపు బిగించుకుని కూర్చున్నాను. కాస్త తలుపు తీసినట్లు కిర్రుమనే శబ్దం వినిపించిందా, ముక్కలు ముక్కలుగా పీకేసేట్లు గంతేసేది ప్రిన్సు. "అలా ఎంతసేపు జరిగింది?" పా అడిగాడు. "సాయంత్రమయేదాకా, ఆ రోజంతా అలాగే లోపల ఉన్నాను. పీటరు తుపాకీ తీసుకెళ్ళిపోయాడుగాని, లేకపోతే కుక్కని చంపేసి ఉండేదాన్ని.

"బాగా పొద్దుపోయిన తర్వాత ప్రిన్సు కాస్త నెమ్మదిపడి గుమ్మంముందు పడుకుంది. సగే యిక అది నిద్రపోతోంది.

కదా! తలుపు ఓరగా నీసి, నీళ్లు తెచ్చుకునేందుకు బైటికి వెళ్ళ వచ్చుననుకుంది ఎల్లా. తలుపు మెల్లిగా తెరిచింది. కుక్క ఒక్కసారి లేచి కూచుంది. ఎల్లా చేతిలో నీళ్ళకుండ చూడ గానే, ఎల్లాకంటె ముందు చెలువుకి దారితీసింది. చెలువు దగ్గరకెళ్లేటప్పటికి, చెలువుచుట్టూ, మంచులో చిలుతపులి అడుగుజాడలు కనిపించాయి'' అన్నాడు మామయ్య. "నా అరచేతులంత పెద్దవిగా ఉన్నాయి ఆ అడుగుజాడలు" అంది అత్తయ్య.

"ఆ చిలుతపులి చాలా పెద్దది, అంత పెద్ద అడుగు జాడలు నేను ఇంతకుముందు చూడలేదు. ప్రిన్సు కనుక ఎల్లాని చెలువుకి వెళ్ళనిచ్చి ఉంటే, ఆ చిలుతపులి తప్పకుండా ఎల్లాని తినేసివుండేది. అడుగు జాడల్ని బట్టి, చెలువుదగ్గిర సింధూరపు చెట్టు నీడలో అది కూర్చుని ఉందని నేను గ్రహించాను. చెలువులో నీళ్లు తాగేందుకు ఏదైనా జంతువు రాకపో తుందా అని అది అక్కడ కాచుకుని ఉంది. ఎల్లాని అది చంపి తినేసి ఉండేదనటంలో మటుకు ఏమాత్రం సందేహం లేదు. "అత్తయ్య అడుగు జాడలు చూసేవేళకిబాగా చీకటి పడిపోయింది. బిందెలో నీళ్లు పట్టుకుని వెంటనే యింటికి తిరిగి వచ్చేసింది. అప్పుడప్పుడు వెనక్కి తిరిగి లోయలోకి చూస్తూ, ప్రిన్సు అత్తయ్యని అంటిపెట్టుకుని ఇంటికి తిరిగి వచ్చింది'' "కుక్కని లోపలికి పిలిచి, పీటర్ వచ్చేంత వరకూ తలుపు తీసి ఉంచాను'' అంది అత్తయ్య. "ఇంతకీ ఆ చిలుతపులి దొరికిందా!" మామయ్యని పా అడిగాడు. "ఊహూ! తుపాకీ తీసుకుని ఆ చుట్టుపక్కలంతా దాని కోసం వెతికి చూశానుగాని కనిపించలేదు. దాని అడుగు జాడలు మటుకు మరికొన్ని కనిపించాయి. చిట్టడివి ఉత్తరం వైపుకి దూరంగా వెళ్ళిపోయింది అది.''

అప్పటికి ఎల్లా, మేరీ, ఎలీస్ అందరూ నిద్రలేచి ఆ కథ వింటున్నారు. దుప్పటిలో తలదూర్చి, ఎలీస్ చెవిలో "అబ్బ! నీకు భయమేయలేదూ?" అంది లారా. ఎలీస్‌తనకు భయమేసిందని చెప్పింది. కాని ఎల్లా మటుకు తనకి భయమేయ లేదని అన్నది. "అట్లాగయితే అందరికీ దాహమేస్తోందని గొడవచేసింది నువ్వేనే?" అంటూ గొణిగింది ఎలీస్.

వాళ్ళు యింకా అలా గుసగుసలాడుకుంటుంటే మా "ఛార్లెస్! నువ్వు సితార్ వాయిస్తేగాని పిల్లలు నిద్రపోయే ట్లు లేరు" అంది పాతో. పా సితార్ తీసుకున్నాడు. ఆ గది అంతా వెచ్చగా, నిశ్శబ్దంగా ఉంది. గోడమీద ఎల్లా, మా, పీటర్‌ల పెద్ద నీడలు పడుతున్నాయి. పా చెవుల కింపుగా సితార్ వాయిస్తున్నాడు.

పా చాలా పాటలు వాయించాడు.

"నా ప్రియమైన నెల్లీ గ్రేని వాళ్ళు తీసుకెళ్ళిపోయారు.

నేను మళ్ళీ ఆ ప్రియతమని చూడలేదు......" అంటూ పా మెల్లిగా పాడుతుంటే లారాకి ఇట్టే నిద్ర పట్టేసింది.

తెల్లారగట్ట, వాళ్ళంతా దాదాపు ఒకే సమయానికి నిద్రలేచారు. వాళ్ళ మేజోళ్ళు చూసుకునేటప్పటికి సంతో షంతో గంతులేశారు. ఎల్లా, ఎలీస్, లారా, ఎర్రని ఉన్ని గౌనులు తొడుక్కుని వున్నారు. పీటర్ ఎర్ర చొక్కా వేసుకున్నాడు. రాత్రిళ్లు పడుకునేటప్పుడు వాళ్ళు ఆ ఎర్రని దుస్తులు తొడుక్కునేవారు. ఆ సంతోషంలో ఆ దుస్తుల తోనే మంచాలమీంచి లేచి పరుగెత్తారు. ఒక్కొక్క మేజోడులో రెండు ఎర్రటి చేతి మేజోళ్ళు, తెలుపు ఎఱుపు చారలతో మిఠాయి వున్నాయి. అవి చూసేటప్పటికి

వాళ్ళకి నోట మాట రాలేదు. సంతోషంలో కళ్ళు మిల మిల లాడాయి. అందరిలోకి లారా, మేరీ మురిసిపోయారు. లారాకి ఒక గుడ్డబొమ్మ క్రిస్‌మస్ బహుమతిగా లభించింది.

ఆ బొమ్మ బలే అందంగా వుంది. రెండు నల్లటి గుండీలతో కళ్ళు, తెల్ల గుడ్డతో ముఖం, నల్ల పెన్సిలుతో గీసిన కనుబొమలు, ఎర్ర సిరాతో గీసిన ఎర్రటి పెదిమలు, ఆ బొమ్మ చక్కదనం యింతా అంతా కాదు. నల్ల దారపు పోగులతో చేసిన దాని జుత్తు ఉంగరాలు ఉంగరాలుగా వ్రేలాడుతోంది. చిన్న ఎర్రటి మేజోళ్ళు, నల్లగుడ్డతో చేసిన జోళ్ళు తొడుక్కుంది ఆ బొమ్మ. గులాబీ, నీలం రంగుపూల గౌను వేసుకుంది. ఆ బొమ్మ చక్కదనం చూసి లారా ఆశ్చర్యంతో నోరు తెరుచుకు నిలబడింది. ఆ బొమ్మని గుండెలకి గట్టిగా అదుముకుని, చుట్టూవున్న వాళ్ళంతా తనవంకే చూస్తున్నారనే విషయమే గమనించలేదు. ఇంతలో అత్తయ్య "అరె! లారా ముఖం చూడండి! ఎలా మురిసి పోతోందో!" అన్నది.

చిన్ని చెల్లాయి కారీ, అత్తకూతురు డర్టన్ మినహా, యింట్లో అందరిలోకి లారాయే చిన్నది. అందుకని చేతి మేజోళ్ళు, మిఠాయి కాకుండా లారాకి ఒక బొమ్మకూడా లభించినందుకు తతిమ్మా పిల్లలు అసూయపడలేదు. ఆ పసిబాబిద్దరూ బొమ్మల్ని ఎత్తుకు మొయ్యలేరు. క్రిస్‌మస్ బహుమతులంటేకూడా వాళ్ళకి అసలు ఏమీ తెలియదు. చుట్టూ జరుగుతున్న సంబరమంతా చూసి, నోట్లో వేళ్ళు పెట్టుకుని కాళ్ళ కింద కొడుతూ కేరింతలు కొట్టారు.

లారా తన బొమ్మని పట్టుకుని మంచం చివర్న కూర్చుంది. తన ఎర్ర చేతి మేజోళ్ళు, మిఠాయి చూసుకు —

చించింది. కాని అన్నిట్లోకి బొమ్మని చూసుకుని మరీ సంతోష పడింది. ఆ బొమ్మకి చార్లెటి అని పేరు పెట్టింది.

ఒకళ్ళ చేతి మేజోళ్ళ వంక ఒకరు చూసుకుంటూ అవి తొడుక్కునేందుకు ప్రయత్నించారు వాళ్ళు. పీటర్ తన మిఠాయిలో ఒక పెద్ద ముక్క కొరికేశాడు. తతిమ్మావాళ్ళు మటుకు తమ మిఠాయి తొందరగా అయిపోకుండా నెమ్మదిగా నాకి రుచిచూడటం ప్రారంభించారు. "సరేగాని! ఇంతకీ ఒక్క మేజోడులో కూడా బెత్తం లేదూ? నిజంగా మీరంతా అంత బుద్ధిమంతుల్లే వున్నారా?" అన్నాడు మామయ్య.

సంవత్సరం పొడుగుతా పిల్లలు అల్లరి చేయకుండా బుద్ధిగా వుంటే క్రిస్‌మస్‌కి చక్కటి బహుమతులు దొరుకుతాయని లేకపోతే బెత్తంలాటివి లభిస్తాయని పిల్లలకి చెప్పేవాళ్లు పెద్దలు. బహుమతులు చూసుకు మురిసిపోయారే గాని ఆ మాట వినగానే ఎవరి మేజోడులోనైనా బెత్తం వుందేమోననే అనుమానం కలిగింది ఆ పిల్లలకి. నిజానికి సంవత్సరమంతా ప్రతి రోజూ అల్లరి చేయకుండా ఉండటమంటే కష్టం కదూ మరి! ఇంతలో అత్తయ్య "పిల్లల్ని అలా ఏడిపించకు పీటర్" అని మామయ్యని మందలించింది. "లారా! నీ బొమ్మని తతిమ్మా పిల్లల్ని ఎత్తుకోనివ్వవా ఏమిటి?" అన్నది మా. మా వుద్దేశం చిన్న పిల్లలు మరీ అంత స్వార్థంగా వుండకూడదని.

అందుకని లారా, మేరీని, ఎలిస్‌నీ, ఎల్లానీ ఒక్కో నిముషం తన బొమ్మని ఎత్తుకోనిచ్చింది. ఆ బొమ్మ ఉంగరాల జుత్తు, బూట్సులు, మేజోళ్లు చూసి మురిసిపోతూ, దాని గౌనుని చేత్తో నిమిరారు వాళ్ళు. కాని చిట్టచివరికి

చార్లెటి జాగ్రత్తగా తన చేతుల్లోకి వచ్చేంతవరకూ లారా భయపడుతూనే వుంది. మా, అత్తయ్య, ఎరుపు తెలుపు దారాలతో అల్లిన చేతిమేజోళ్ళని, పాకి మామయ్యకీ బహూకరించారు. మాకి అత్తయ్య ఒక పెద్ద ఆపిల్ పండు యిచ్చింది. అత్తయ్యకి మా, పైన సిల్కుగుడ్డ, లోపల ఫ్లానెల్ గుడ్డముక్కలతో కుట్టిన, సూదులు గుచ్చుకునే ఒక చిన్న పుస్తకాన్ని బహూకరించింది. మా తయారు చేసిన పుస్తకాన్ని అందరూ మెచ్చుకున్నారు. మామయ్య తనకి అలాటిదే మునుపు చేసిపెట్టారనీ, కాని అది యింత బాగా లేదనీ చెప్పింది అత్తయ్య. పిల్లల అభిప్రాయం ప్రకారం పెద్దవాళ్ళకి దేవతలు బహుమతులివ్వరు. అంతమాత్రాన ఏడాదంతా వాళ్ళు బుద్ధిగా లేరని అర్థంకాదు. వాళ్లు పెద్ద వాళ్ళు కాబట్టి ఒకరికొకరు బహుమతులిచ్చుకోవాలి.

ఆ తర్వాత కాసేపు క్రిస్మస్ బహుమతులన్నీ అవతల పెట్టేశారు. పా, మామయ్య, పీటరు బైట పనులు చూసుకునేందుకు వెళ్లిపోయారు. ఎలీస్, ఎల్లా పక్కలు వేయటంలో అత్తయ్యకి సాయంచేశారు. మా భోజనం తెస్తుంటే, లారా, మేరీ బల్ల శుభ్రంచేశారు.

క్రిస్మస్ పండుగకి మా ముఖ్యంగా కేకులు చేసేది. మనిషి ఆకారంలో చిన్నచిన్న కేకులను చేసి పిల్లలకు తలొకటీ యిచ్చేది. మా పిలవగానే, పిల్లలు ఒకళ్ళ తరవాత ఒకళ్ళు పొయిదగ్గిరకెళ్ళి, కేకులు చేయటం చూసేవారు.

పొయిమీద పెనంవేసి, గరిటెతో చేతులు, కాళ్ళూ తలవున్న ఒక మనిషి బొమ్మని జేసేది. వెంటనే, అతి జాగ్రత్తగా దాన్ని ఆ కాలుతున్న పెనంమీద తిరగవేసేది. అలా

యింకా పొగలు కక్కుతుండగానే దాన్ని కళ్లెంలోకి తీసి వేసేది. అదంతా చూట్టానికి తమాషాగా ఉండేది.

పీటర్ మొదట్లోనే ఆ కేకు తలవైపు భాగం తినేసే వాడు. లారా, ఎల్లీన్, మేరీ మటుకు మొదట చేతులు, తర్వాత కాళ్ళు, తర్వాత పొట్ట, యిలా మెల్లిగా కొరుక్కుంటూ ఆఖుంకి తల తినేవారు.

ఆ రోజు చలి ఎక్కువగా ఉండటంవల్ల, బైట ఆడుకునేందుకు వెళ్ళలేదు. ఇంట్లోనే కింద. ఓ గుంపుగా కూర్చుని, మిఠాయి తింటూ, చేతి మేజోళ్లు చూసుకుంటూ కూర్చున్నారు. తర్వాత బైబిలులోని బొమ్మలు, పా పెద్ద, పచ్చని పుస్తకంలోని రకరకాల పక్షుల, జంతువుల బొమ్మలు చూశారు. లారా ఒక్క నిమషం కూడా వదలకుండా తన బొమ్మని ఎత్తుకు కూర్చుంది.

ఆ తర్వాత క్రిస్‌మస్ భోజనానికి లేచారు. భోజనాల దగ్గిర పిల్లలు ఏమీ అడక్కూడదని వాళ్ళకి తెలుసు. అందుకని నిశ్శబ్దంగా కూర్చున్నారు. కాని వాళ్లు రెండోసారి ఏదన్నా వెయ్యమని అడగకముందే, మా, అత్తయ్య, మంచి మంచి పిండివంటలతో వాళ్ళ పళ్ళాలు నింపుతూ వచ్చారు. వాళ్ళు తినగలిగినంత వాళ్ళని హాయిగా అన్నీ తిననిచ్చారు. "క్రిస్‌మస్ సంవత్సరానికి ఒక్కసారే వస్తుంది" అంది అత్తయ్య.

అత్తయ్య, మామయ్య, పిల్లలు చాలాదూరం వెళ్ళాలి గనుక ఆవేళ పెందరాళే భోజనాలయిపోయాయి. "గుఱ్ఱాలు ఎంత వేగంగా పరుగెత్తినా, చీకటిపడేలోపు యింటికి చేరుకోవటం కష్టం" అన్నాడు మామయ్య. అందుకని భోజనాలయిన వెంటనే, పా, మామయ్య గుర్రాలను తెచ్చేందుకు గుర్రాల శాలకి వెళ్ళారు. మా, అత్తయ్య పిల్లలకి దుప్పట్లు

కప్పటం ప్రారంభించారు. వాళ్ళు ఉన్ని మేజోళ్ళు, బూట్సులు తొడుక్కున్నారు. చేతిమేజోళ్ళు, టోపీలు, శాలువలు వేసుకుని, మెడకి మఫ్లర్లు చుట్టుకుని, ముఖాలకి ఉన్ని ముసుగులు కప్పుకున్నారు. అత్తయ్య, వెచ్చగా ఉండేందుకని మేజోళ్ళను నిప్పుదగ్గర పెట్టింది. దుప్పట్లనీ, శాలువలనీ కూడా నిప్పుదగ్గిర వెచ్చబెట్టారు. గుర్రబండీలోకి ఎక్కగానే, వాళ్ళకెంతో వెచ్చగా హాయిగా ఉంది. "టా! టా! వెళ్ళొస్తాము" అంటూ అరుస్తూ వాళ్ళు వెళ్ళిపోతుంటే, గుర్రం డెక్కల, గజ్జల చప్పుడు దూర దూరంగా వినిపించింది. ఒక్క త్రుటిలో ఆ బండీ వెళ్ళిపోయి, క్రిస్మస్ వేడుకంతా పూర్తయింది. కాని క్రిస్మస్ ఎంత ఆనందంగా గడిచింది!!

# 3

చలికాలం ఎంతకీ తరిగేటట్లు కనుపించలేదు. ఎంత సేపూ యింట్లో కూర్చునుండటం లారాకీ, మేరీకీ విసుగు పుట్టడం ప్రారంభించింది. ముఖ్యంగా ఆదివారాలు బొత్తిగా ఏమీ తోచేది కాదు. ప్రతి ఆదివారం లారా, మేరీ మంచి బట్టలు వేసుకునేవారు. తల్లో కొత్త రిబ్బనులు కట్టుకునేవారు. శనివారం రాత్రిళ్లు నీళ్లు పోసుకొని, ఆదివారం శుభ్రంగా అలంకరించుకునేవారు.

వేసంగిలో చెఱువునుంచి నీళ్ళు తెచ్చుకుని స్నానం చేసేవారు. కాని చలికాలంలో పా తొట్టినిండా మంచు నింపేవాడు. దాన్ని పొయిమీద కరగబెట్టేవారు. ఆ పొయికి పక్కనే రెండు కుర్చీలకి, తెరకిమల్లె అడ్డంగా ఓ దుప్పటి కట్టి దాని అవతల మేరీకీ, లారాకీ నీళ్ళు పోసేది మా.

లారా చిన్నది కావటంవల్ల, తనకి ముందుగా నీళ్లు పోసేది. చార్లొటీని పక్కలో పెట్టుకుని, ఆ చిన్నారి తని వారం పెందరాళే నిద్రపోయేది. ఎందుకంటే లారా నీళ్ళ యిన తర్వాత, మళ్లా మేరీకోసరం తొట్టి శుభ్రం చేసి, దానినిండా మంచుపోసేవాడు పా. మేరీ తర్వాత మా, ఆ తర్వాత పా, దుప్పటి తెర కాతల స్నానంచేసేవారు. ఆదివారానికల్లా అందరూ శుభ్రంగాత యారయేవారు.

ఆదివారాలు మటుకు మేరీ, లారా గట్టిగా అరిచి, పరుగులెత్తి, ఆడుకునేందుకు వీలుండేది కాదు. మేరీ దుప్పటి మీద పూలు కుట్టేది కాదు. లారా తన చిన్ని చెల్లాయికి మేజోళ్ళు అల్లేది కాదు. కాయితం బొమ్మలకేసి నింపాదిగా చూసుకునే వారుగాని, కొత్త బొమ్మలేమీ చేసుకునేవారు కాదు. గుడ్డబొమ్మలమీద కూడా పిన్నులు పెట్టటానికి వీలుండేది కాదు ఆవేళ.

పుస్తకంలో బొమ్మలు చూడటంగాని, గుడ్డబొమ్మల్ని ఎత్తుకుని మాట్లాడటం గాని చేసేవారు. మా బైబిలు కథలు గాని, పా "వండర్సు ఆఫ్ ది ఎనిమల్ వరల్డ్" (విచిత్ర జంతు జీవనము) అనే పచ్చ పుస్తకంలోంచి సింహం, పులి, ఎలుగు బంట్లు కథలు చదువుతుంటే నిశ్శబ్దంగా కూర్చుని వినేవారు. కాని అంతకుమించి ఆ రోజు యింకేమీ చేసేవారు కాదు. లారాకి పెద్ద బైబిలులోని బొమ్మలు చూడటమంటే చాలా యిష్టం. అన్నిట్లోకీ ముఖ్యంగా ఆడమ్ జంతువులకి పేర్లు పెట్టే బొమ్మ మరీ యిష్టం. ఆ బొమ్మ ఏమిటంటే, ఆడమ్ ఒక పెద్ద రాయిమీద కూర్చునున్నాడు, అన్ని రకాల జంతువులు, పక్షులూ అతని చుట్టూ నిలబడి, ఆడమ్ తాము ఏ జాతికి చెందినజంతువులని చెబుతాడో అని ఆతు రతతో అతనివంక చూస్తున్నాయి. ఆడమ్ బొమ్మలో చాలా సంతోషంగా కనబడుతున్నాడు. అతని వొంటిమీద బట్టలేమీ

లేవు. నడుంచుట్టూ ఒక తోలు మటుకు కట్టుకున్నాడు. "ఆదివారాలు వేసుకునేందుకు ఆడమ్‌కి మంచి బట్టలుండేవా?" అడిగింది మా ని లారా. "ఊహూ. పాపంఆడమ్‌కి బట్ట లుండేవి కావు. ఒంటిమీద తోళ్ళు మటుకే వేసుకునేవాడు" అంది మా. లారాకి ఆడమ్‌ని చూస్తే జాలి కలగలేదు. తను కూడా ఆడమ్ లాగా తోళ్లు వేసుకుంటే బాగుండుననుకుంది.

ఒక ఆదివారం, భోజనాలవగానే యికఆ వాతావరణం ఏ మాత్రం భరించలేక పోయింది లారా. జాకీతో ఆడుకోవ టం ప్రారంభించింది గాని అది వెంటనే గంతులేస్తూ అరవటం మొదలెట్టింది. పా లారాని కుర్చీలో నెమ్మదిగా కూర్చో మన్నాడు. కూర్చున్న మరుక్షణంలో, కాళ్ళతో కుర్చీని కొడుతూ ఏడుపు లంకించుకుంది. "నాకు ఆదివారాలంటే అస హ్యం" అంది. పా పుస్తకం కిందపెట్టి, "లారా'యిలారా" అన్నాడు కోపంగా. తనకి దెబ్బలు తప్పవని తెలిసి, నెమ్మ దిగా కాళ్ళీడ్చుకుంటూ పా దగ్గరకి వెళ్ళింది లారా. కాని పా ఓ క్షణం జాలిగా లారా ముఖంలోకి చూసి, ఒళ్ళోకి తీసుకుని, గుండెలకి హత్తుకున్నాడు. మేరీని కూడా ఒక చేత్తోదగ్గిరికి తీసుకుంటూ "తాతయ్య చిన్ననాటి కథ ఒకటి చెబుతాను రా" అంటూ కథ మొదలు పెట్టాడు. "తాతయ్య చిన్నప్పుడు, యిప్పటిలాగ ఆదివారం పొద్దున్న ప్రార్థనలు చేసేవాళ్లు కారు. శనివారం అర్థరాత్రినుంచే ఎక్కడి వాళ్ళక్కడ పనులు మానేసుకుని, ప్రార్థన మొదలు పెట్టేవారు. భోజనాల దగ్గిర అంతా నిశ్శబ్దంగా వుండే వారు. ఆ తర్వాత ముత్తాత బైబిలు చదువుతుంటే, తతిమ్మా వాళ్ళంతా మెదలకుండా కుర్చీల్లో కూర్చుని వినేవారు. ఆ తర్వాత అందరూ మోకాళ్ళమీద కింద కూర్చునేవారు. ఫాదరు ప్రార్థనచేసే వాడు. "ఆమెన్" అంటూ లేచినిలబడి,

ఒక్కొక్కరే కొవ్వొత్తి తీసుకుని, పడుకునేందుకు వెళ్ళే వారు. మాటలు, నవ్వులు, ఆటలు, ఏమీ లేకుండా ప్రార్థన నుంచి తిన్నగా పడుకునేందుకు వెళ్ళాలి వాళ్ళు."

"ఆదివారాలు ఏమీ వండకూడదు కాబట్టి, ఆదివారం పొద్దుటి భోజనాలు చల్లగా వుండేవి. ఆ తర్వాత చక్కటి బట్టలేసుకుని, చర్చికి వెళ్ళేవారు. ఆదివారాలు అసలు ఏ పనీ చెయ్యకూడదు. కాబట్టి గుర్రంబండీ ఎక్కటానికి వాళ్ళకి వీలుపడేది కాదు. అందుకని కాలినడకనే చర్చికి వెళ్ళవలసి వచ్చేది.

చర్చికి వెళ్ళేటప్పుడు ఇటూ అటూ దిక్కులు చూడ కూడదు. ఎంతో గంభీరంగా, నెమ్మదిగా అడుగులేసుకుంటూ నడవాలి. హాస్యాలాడుకోవటంగాని, నవ్వటంగాని చెయ్య కూడదు. అసలు ముఖాన చిరునవ్వు కూడా కనపడకూడదు. తాతయ్య,అతని అన్నలు ముందు, ముత్తాత, ముత్తవ్వ, వెనకా నడుముకుంటూ చర్చికి వెళ్ళేవారు.

చర్చిలో రెండు గంటలసేపు అల్లరి చేయకుండా నెమ్మదిగా కూర్చుని ప్రార్థన వినవలసి వచ్చేది. కాళ్ళాడించ టం గాని, ముందున్న బల్లని కదిలించడంగాని చెయ్య కూడదు. తలతిప్పి కిటికీల వంకా, పైకప్పువంకా, గోడల వంకా అసలే చూడకూడదు. పూజారి వైపు నుంచి ఒక్క క్షణం కూడా కళ్ళుతిప్పకుండా, కదలకుండా, కూర్చోవాలి. ప్రార్థన పూర్తవగానే మళ్ళా యింటికి వెళ్ళిపోవాలి. ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు మాట్లాడుకో వచ్చుగాని, గట్టిగా అరవ టం గాని, నవ్వటం గాని చెయ్యకూడదు. అంతకు క్రితం రోజు వండటం వల్ల, భోజనం చల్లగా వుండేది. ఆ తర్వాత ఒక బెంచీమీద వరుసగా కూర్చుని దైవబోధనలను చదువు

చూసేవారు. మధ్యాహ్నం నుంచీ పొద్దుకూకేంతవరకూ, అది వారమంతా అలా చదువుకూనే వుండేవారు.

చిట్టడివిలో ఒక నునుపైన కొండవుండేది. ఆ కొండ మధ్యలో వుండేది తాతయ్య యిల్లు. కొండపైనుంచి కిందికి ఒక రోడ్డు వుండేది. తాతయ్య యింటి ముందుగానే వెళ్ళేది ఆ దారి. చలికాలంలో కొండదిగి రావటమంటే బలే సరదాగా వుండేది.

ఒక రోజు తాతయ్య, అతని అన్నలు జార్జి, జేమ్సు కలసి ఒక బండీ తయారుచేయటం మొదలెట్టారు. ఆడుకునేందుకు సమయం చిక్కినప్పుడల్లా ఆ బండీ దగ్గిరికి పరుగెత్తేవాళ్ళు. వాళ్లు ముగ్గురు కూర్చునేందుకు వీలుగా, పొడుగ్గా ఎంతో బాగా తయారయింది ఆ బండీ. ప్రతి శనివారం వాళ్లకి ఆడుకునేందుకు రెండు మూడు గంటల వ్యవధి చిక్కేది. అందుకని ఒక శనివారం మధ్యాహ్నం ఆ బండీ ఎక్కి కొండ దిగటానికి నిశ్చయించుకున్నారు.

కాని ఆ రోజు వాళ్ళ నాన్న చిట్టడవిలో చెట్లు కొట్టడం ప్రారంభించాడు. ఆ పని చాలా కష్టమైంది కాబట్టి కుర్రాళ్ళని కూడా తనకి తోడుగా వెంటబెట్టు కెళ్ళాడు. శనివారం పొద్దున్నే లాంతర్లు పెట్టుకుని, నీతిబోధనలు చదువుకున్నారు. పొద్దెక్కే సమయానికి అడవికి వెళ్ళి పని చేసారు. మళ్ళీ చీకటి పడిన తరువాత యింటికివచ్చి, నీతి బోధనలు చదివారు. ఆదివారం పెందరాళే లేవాలి కనుక, భోజనాలయిన వెంటనే పడుకోవటానికి వెళ్ళారు.

శనివారం మధ్యాహ్నం వరకూ, బండీ దగ్గిరికి వెళ్ళటానికే తీరుబడి లేకపోయింది. ఎంత తొందరగా పనిచేసినా శనివారం రాత్రిలోపు దాన్ని పూర్తిచేయలేక పోయారు.

శనివారం చీకటి పడినతరువాత అసలు ఒక్కసారి కూడా కొండ దిగటానికి వీలులేదు. అలా చేస్తే పుణ్య దినాన్ని ధిక్కరించినట్లు అవుతుంది. అందుకని ఆదివారం పూర్తయేంత వరకూ, యింటివెనకాల గుడిసెలో దాన్ని అట్టే పెట్టారు.''

"ఆ మర్నాడు చర్చిలో వున్న రెండుగంటల సేపూ, నిశ్శబ్దంగా కూర్చుని పూజారివంక చూశారే గాని, వాళ్ళ మనసంతా ఆ బండీమీదే వుంది. ఇంటి దగ్గిర భోజనాలకి కూర్చునపుడు కూడా, వాళ్లు బండీని గురించే ఆలోచించసాగారు. భోజనాలయాక, ముత్తాత బైబిలు చదివేందుకు వుపక్రమించాడు. తాతయ్యా, జార్జి, జేమ్సు, బెంచీలమీద వరుసగా కూర్చుని, పుస్తకాలు చేతుల్లో పట్టుకున్నారే గానీ, ఆ బండీ వాళ్ళ మనసుని పూర్తిగా ఆక్రమించేసుకుంది.

కిటికీలోంచి బైటికి చూస్తే, ఎండ బాగా కాస్తోంది. రోడ్డుమీద మంచు ధగ ధగ మెరుస్తోంది. కొండదిగి వెళ్ళేందుకు ఆ రోజు బహు చక్కగా వుంది. వాళ్ళు తమ పుస్తకాల వంక జాలిగా చూసుకుని, కొత్త బండీని గురించి కలలు కనటం ప్రారంభించారు. ఆదివారం ఎంతకీ తెగేటట్లు కనుపించలేదు. వాళ్ళకి చాలా విసుగు, చిరాకు పుట్టుకొచ్చాయి.

అలా చాలా సేపయాక, ఒక పెద్ద గురక వినబడింది వాళ్ళకి. తల ఎత్తి చూస్తే, వాళ్ళ నాన్న హాయిగా కుర్చీకి జారగిలబడి, కునుకు తీస్తున్నాడు.

తర్వాత జేమ్సు జార్జి వంకచూసి, చప్పుడుచేయకుండా వెనక తలుపు లోంచి బైటికి వెళ్లిపోయాడు. జార్జి కూడా అలాగే చేశాడు. తాతయ్యా వాళ్ళ నాన్న వంకభయంతో

చూశాడు కాని వెంటనే జార్జి వెనకాతలే బైటికి వెళ్ళి పోయాడు.

కొత్తబండీ తీసుకుని, చప్పుడు చేయకుండా కొండ మీదికి వెళిపోయారు వాళ్ళు. కొండమీంచి ఒక్కసారి మటుకు కిందికి దిగి, మళ్ళా చడీచప్పుడు చేయకుండా, వాళ్ల నాన్న నిద్రలేచే లోపు యింటికి వెళిపోవాలను కున్నారు.

ముందు జేమ్సు, తర్వాత జార్జి, తర్వాత తాతయ్య వరుసగా ఆ బండీలో కూర్చున్నారు. తాతయ్య అందరిలోకి చిన్నవాడు కాబట్టి అఖర్న కూర్చున్నాడు.

ముందు నెమ్మదిగానూ, క్రమంగా వేగంగానూ పోసా గింది ఆ బండీ. కొండమీంచి ఊగుకుంటూ, అటూ యిటూ వంగుతూపోతోంది అది. కాని అది యింటిముందు నుంచే వెళ్లాలి కాబట్టి, వాళ్ల నాన్న ఎక్కడ నిద్రలేస్తాడోనని, వాళ్ళు హుషారుగా చప్పట్లు కొట్టడం మానుకున్నారు.

ఈదురుగాలి, బండిచక్రాలు తిరగటం మినహా, వేరే శబ్దమే రావటం లేదు. ఇంతలో సరిగ్గా బండి యింటి వైపు వెళ్లే సమయానికి, ఒక పెద్ద నల్లని పంది అడవి లోంచి వచ్చి, రోడ్డుకి అడ్డంగా నిలబడింది.

బండీ చాలా వేగంగా పోతుండటం వల్ల దాన్ని ఆప టానికి వీలులేకపోయింది. కనీసం బండీని తిప్పేందుకయినా వ్యవధి లేదు. బండీపోయేవేగానికి పందికూడా బండీలో పడ్డది. కీచుమనే ఒక్క కేకతో జేమ్సు మీద కూలబడి, అది పెద్దగా హోరెత్తేట్టు అరవటం ప్రారంభించింది.

ముందు పంది, తర్వాత పిల్లలు ముగ్గురు కూర్చుని యింటిముందు నుంచి వెళుతుంటే, వాళ్ళ నాన్న గుమ్మం దగ్గి రకు వచ్చి నిలబడి వాళ్లని చూశాడు. ఆ బండీని ఆపటానికి

గాని, దాక్కునేందుకు గాని, ఏదైనా మాట్లాడేందుకు గాని వాళ్లకు వ్యవధిలేకపోయింది. కొండ కిందికి వెళ్ళేంతవరకూ, పంది జార్జి వొళ్ళో కూర్చుని అరుస్తూనే వుంది.

కొండ అంచున బండీని ఆ పారు. పంది కేకలుపెడుతూ జేమ్సు వొళ్ళోంచి దూకి, అడవిలోకి పారిపోయింది. వాళ్ళు ముగ్గురూ బిక్కముఖాలేసుకుని, నెమ్మదిగా యింటికి నడుచుకుంటూ వెళ్ళారు. బండిని గుడిసెలో పెట్టేసి, యింట్లోకి దూరి, బెంచీలమీద తమ తమ స్థానాలలో చప్పుడు చేయకుండా వెళ్ళి కూర్చున్నారు. వాళ్ళ నాన్న బైబిలు చదువుతూనే వున్నాడు.. మధ్యలో తల ఎత్తి వాళ్లకేసి మౌనంగా చూశాడు. మళ్లా బైబిలు వంక చూసి చదవటం ప్రారంభించాడు.

కానీ చీకటి పడ్డాక పూజలయి పోగానే, వాళ్ళని పెరట్లోకి తీసుకెళ్ళి, వరుసగా వీపు బద్దలకొట్టాడు. అందుకని, అల్లరి చేయకుండా వుండటం మీకు కష్టంగానే తోచవచ్చు. కాని తాతయ్య చిన్నతనంలో అది యింకా కఠినంగా వుండేదని మరిచిపోకండి" అంటూ ముగించాడు పా.

"చిన్న పిల్లలు కూడా అంత బుద్ధిగా వుండాలా?" అనడిగింది లారా. "అమ్మాయిలకే అది మరీ కష్టం. ఒక్క ఆదివారాలే కాదు, అమ్మాయి లెప్పుడూ బుద్ధిగా వుండాలి. మొగపిల్లలకు మల్లె వాళ్లు కొండదిగడానికి వీలులేదు. ఆడపిల్లలు అల్లుకుంటూ యింట్లో కూర్చోవాలి" అంది మా. "ఆ! ఇప్పుడిక వెళ్ళి పడుకోండి" అంటూ పా తన ఫితార తీశాడు. లారా, మేరీ మంచంమీద పడుకుని, ఆదివారం గీతాలని విన్నారు. ఆదివారాలు, మామూలు రోజుల్లో మల్లె మిగతా పాటలు పాడకూడదు.

"తతిమ్మా వాళ్ళంతా యుద్ధంలో పోరాడేందుకు
రక్తమయమైన సముద్రంలో కొట్టుకుపోతుంటే,
నేను మెత్తని పూలపాన్పుమీద పడుకుని
ఆకాశాని కెగిరిపోనా!"

అంటూ పా పాడుతుంటే, లారాకి యిట్టే నిద్రపట్టేసింది. మళ్ళీ తెల్లారగట్ట మా వంటయింట్లో చేసిన చప్పుడుకే లారాకి మెలుకువ వచ్చింది. సోమవారం వచ్చేసింది, మళ్ళీ ఓ వారం దాకా ఆదివారం రాదని లారా చాలా సంతోషించింది. ఆ రోజు పొద్దున పా భోజనానికి వచ్చినప్పుడు, లారాని పట్టుకుని ఒక్క దెబ్బ వేస్తానన్నాడు. ఆవేళ లారా పుట్టినరోజు. ఆ రోజుగనుక దెబ్బలు వెయ్యకపోతే, మరుసటి సంవత్సరం లారా బుద్ధిగా ఉండదని పా అభిప్రాయం. అందుకని "ఒకటి... రెండు..." అంటూ లెక్కపెడుతూ లారాని మృదువుగా ఆరు దెబ్బలు కొట్టాడు. ఆ దెబ్బలు లారాకేమీ బాధ కలిగించలేదు. ఆ తర్వాత, కొయ్యతో చేసిన ఒక అమ్మాయి బొమ్మ యిచ్చాడు బహుమతిగా. చార్లటీకి తోడుగా ఆ బొమ్మని అట్టేపెట్టుకోమన్నాడు పా. ఆ సంవత్సరంతో లారాకి అయిదేళ్లు నిండి, ఆరోఏడు వస్తుంది. అందుకనిమా లారాకి సరిగ్గా అయిదు చిన్న చిన్న కేకులను యిచ్చింది. బొంత కుడుతున్నట్టే నటించి మేరీ లారా బొమ్మకి ఓ చక్కని గౌను కుట్టి యిచ్చింది. ఆవేళ రాత్రి, లారా పుట్టిన పండగకని పా "పాప్ పీస తాకి వెళ్ళాడు" అనే పాట వాయించాడు. అతను సితార్ వాయిస్తుంటే, లారా, మేరీ అతని మోకాళ్ళ దగ్గిర కూర్చున్నారు. "ఇప్పుడు వినండి" అంటూ పా యిలా మొదలు పెట్టాడు:

"ఒక దారంవుండకి పెన్నీ,
ఒక సూదికి పెన్నీ
డబ్బు ఆ విధంగా ఖర్చయేది..."

అసలు కథంతా ముందుందని తెలిసి, లారా, మేరీ ఆతుర తతో ముందుకి వొంగారు. పా ఉన్నట్లుండి పాడటం మానేసి, సితార్ వృత్తినే వాయించటం ప్రారంభించాడు. కాస్సేపటికి అదికూడా ఆపేశాడు. "ఊ! ఊ! దయచేసి మళ్ళీ వాయించు" అంటూ లారా, మేరీ బతిమాలుకున్నారు. పా చిన్నగా నవ్వుతూ మళ్ళీ సితార్ వాయించటం ప్రారంభించాడు.

"మాదిగవాడి బల్లచుట్టూతా
కోతి ఆ జంతువుని వెంటాడింది,
మాదిగవాడు భార్యని ముద్దెట్టుకున్నాడు-
హుూయ్‌మంటూ పరుగెత్తింది ఆ జంతువు"

పా గబగబ సితార్ వాయిస్తుంటే, అసలు అతనివేళ్లు కదిలినట్లే అనిపించలేదు లారాకీ, మేరీకీ. ఆ పాట వింటూ హాయిగా నిద్రపోయారు వాళ్ళిద్దరూ.

"పూర్వం ఒక నల్లటతను ఉండేవాడు,
అతన్ని నెడ్ మామయ్యా అని పిలిచేవారు,
అతను చాలా కాలంక్రితమే చనిపోయాడు,
అతని తలమీద ఒక్క వెంట్రుకకూడా ఉండేదికాదు;
అతనిది బట్టతల"

"అతని వేళ్లు సన్నగా వూచపుల్లలకిమల్లె ఉండేవి,
అతని కళ్లు గుంటలుగా లోతుకుపోయుండేవి,
బోసినోరు కావటంవల్ల అతను కేకు తినలేకపోయే వాడు,
అందుకని కేకుని వదిలిపెట్టేసేవాడు"

"పాఱని యిక పైన తగిలించెయ్యండి,
సితార్‌ని యిక కింద పెట్టెయ్యండి,
నెడ్ మామయ్యకి యిక చెయ్యవలసిన పనేమీ లేదు,
అతను ఎప్పుడో చనిపోయాడు."

# 4

ఇట్లా ఉంటుండగా, ఓ రోజు వసంతకాలం రాబోతోందన్నాడు పా. చిట్టడివిలో మంచు నెమ్మది నెమ్మదిగా కరగటం ప్రారంభించింది. చెట్ల కొమ్మలనుంచి మంచుబొట్లు కిందికి రాలాయి. మధ్యాహ్నం పూట, యింటి కప్పుమీదగా కిందికి రాలుతూ ఆ మంచుబొట్లు తళతళ మెరిసేవి.

చలికాలంలో పోగుచేసిన జంతువుల తోళ్ళన్నీ పట్నానికి వెళ్ళి అమ్ముకొస్తానన్నాడు పా. ఒకరోజు సాయంత్రం అవన్నీ మూట కట్టాడు. ఆ తోళ్లు చాలా ఉండటంవల్ల మొత్తం అన్నిటినీ కలిపి కట్టేటప్పటికి ఓ పెద్ద మూటయి కూర్చుంది.

ఒకరోజు పెందరాళే ఆ మూటని బుజాన వేసుకుని పా పట్నానికి నడక ప్రారంభించాడు. ఆ మూట చాలా పెద్దది కావటంవల్ల, పా తుపాకీ తీసుకెళ్ళలేకపోయాడు.

మా చాలా భయపడింది. కాని పెందరాళే బయలుదేరి గబ గబ నడిచి వెళ్ళిపోతే, పొద్దుకూకకముందే తిరిగి రావచ్చనీ, భయమేమీ లేదనీ ధైర్యం చెప్పాడు పా.

చిట్టడివినుంచి ఏ వూరికి వెళ్ళాలన్నా చాలా దూరమే నడవాలి. లారా, మేరీ అంతకుముందెప్పుడూ పట్నం చూడ లేదు. కిరాయి దుకాణం చూడలేదు. అసలు పక్క-పక్కనే ఉండే రెండు యిళ్ళనికూడా చూసి ఎరగరు. కాని పట్నం నిండా బోలెడన్ని యిళ్లు ఉంటాయనీ, మిఠాయికొట్లే కాక, యింకా ఉప్పు, చక్కెర అమ్మే కొట్లూ ఉంటాయనీ తెలుసు వాళ్ళకి. పా ఆ తోళ్లు యిచ్చి, వాటికి బదులుగా దుకాణం నుంచి చక్కటి వస్తువులు పట్టుకొస్తాడనీ వాళ్ళకి తెలుసు. ఆ రోజంతా వాళ్లు ఆ బహుమతులకోసరం ఎదురుచూస్తూ కూర్చున్నారు. చెట్లవెన కాతలనుంచి సూర్యుడు అస్తమించి, మంచుగడ్డలు కరగటం ఆగిపోయాక, వాళ్లు పా కోసరం వెయ్యికళ్ళతో చూడసాగారు.

పొద్దుకూకింది. అడవంతా చీకటి అలముకుంది. కాని పా జాడ ఎక్కడా లేదు. మా భోజనం తయారుచేసి బల్ల మీద పెట్టిందే కాని, పా రాలేదు. ప్రార్థన చేయవలసిన వేళ కూడా అయింది. కాని పా తిరిగి రాలేదు.

మా పాలు పితకటానికి బయలుదేరుతూ లారాని లాంతరు పట్టుకుని వెంట రమ్మంది. లారా కోటు వేసుకుం టుంటే, మా బొత్తాములు పెట్టింది. లారా తన ఎర్రటి చేతి మేజోళ్లుకూడా తొడుక్కుంది. ఇంతలో మా లాంతరు వెలి గించింది. పాలు పితకటంలో మా కి సాయపడుతున్నందుకు లారా ఎంతో గర్వపడింది. లాంతరు పట్టుకుని మెల్లిగా నడక ప్రారంభించింది. రేకుతో తయారుచేసిన ఆ లాంతరుకి వెలుగుపడేందుకుగాను, అక్కడక్కడ కంతలు ఉన్నాయి.

ఆ లాంతరు పట్టుకుని మా వెనకాల నడుస్తుంటే, లారాచుట్టూ మంచుమీద బాగా వెలుగు పడింది. రాత్రి యింకా బాగా చీకటి పడలేదు. అడవిలో చీకటిగా ఉంది కానీ, మంచుతో వ వెలుగ్గానే ఉంది. ఆ కాశంమీద అక్కడక్కడ నక్షత్రాలు కూడా ఉన్నాయి. ఆ నక్షత్రాలు లాంతరు వెలుగులో అంత కాంతివంతంగాకూడా లేవు.

వాళ్ళ ఆవుపేరు సుకీ... అది గోధుమరంగులో ఉండేది. చీకట్లో దాన్ని నల్లని ఆకారం చూసేటప్పటికి, మా కీ, లారాకీ, యిద్దరికీ ఆశ్చర్యమేసింది.

వసంత కాలం యింకా రాలేదు కాబట్టి సుకీని మేతకి అడవుల్లో వదిలేవారు కాదు. అందుకని అది గాదెదగ్గరే ఉండేది. కాని అప్పుడప్పుడు కాస్త ఎండ కాసే రోజుల్లో దాన్ని బైట వదిలిపెట్టేవారు. మా, లారా పాలు పితకటా నికి వెళ్ళేటప్పటికి అది కంచెలోపల ఉంది. మా తలుపు తియ్యటానికి ప్రయత్నించిందిగాని సుకీ అడ్డం ఉండడంవల్ల అది బాగా తెరుచుకోలేదు. "సుకీ! అడ్డులే!" అంటూ మా ఒంగి, దాని వీపు చరిచింది. సరిగ్గా ఆ సమయానికి, లాంతరు వెలుగు లోపల పడింది. లారాకి నల్లని పెద్ద జూలు, రెండు మిలమిలలాడే కళ్లు కనిపించాయి. సుకీ తోలు పల్చగా, గోధుమరంగులో ఉండేది. సుకీ కళ్లు విశాలంగా, ఎంతో సౌమ్యంగా ఉండేవి. "లారా! తిరిగి ఇంటికి పద" అంది మా. లారా వెనక్కి తిరిగి యింటిముఖం పట్టింది. మా లారా వెనకాల నడిచింది. సగం దూరం వెళ్ళినతరువాత, లారాని ఎత్తుకుని, లాంతరు తీసుకు పరుగెత్తసాగింది మా. ఒక్క దూకున యింట్లోకి దూరి, తలుపు బిడాయించింది. "మా! అది ఎలుగుబంటా?" అనడిగింది లారా. "అవును. ఎలుగుబంటి" అంది మా.

లారా ఏడుపు మొదలెట్టింది. "అబ్బ! ఎలుగుబంటి సుకీని తినేస్తుందా?" అంటూ మా ని పట్టుకుని ఏడిచింది. "ఊహు, సుకీ గాదెలోపల భద్రంగా వుంది. గాదెచుట్టూ పెద్ద దుంగలున్నవని గుర్తుంచుకో, గాదె తలుపు గట్టిగా మూసేసివుంది. ఆ తలుపులోంచి ఎలుగుబంట్లు లోపలికి పోలేవు. నా మాటవిను! ఆ ఎలుగుబంటి లోపలికెళ్ళి సుకీని తినలేదు" అంది మా లారాని దగ్గిరికి తీసుకుంటూ.

లారాకి కొంచెం ఉపశమనం కలిగింది. కాని వెంటనే "అయితే అది మనల్ని తినగలదా?" అనడిగింది. "మనల్ని అది ఏమీ చెయ్యలేదుగా! నేను చెప్పినట్లు విని నువ్వు వెంటనే పరుగెత్తు కొచ్చేయటం చాలా మంచి పనిచేశావు. ఎంచక్కా ఎందుకు? ఏమిటి? అంటూ చొప్పదంటు ప్రశ్నలెయ్యకుండా వచ్చేశావు "అని బుజ్జగించింది మా. మా కూడా భయంతో వణుకుతోంది. కాని కొద్దిగా నవ్వుతూ, "తలుచుకుంటే నవ్వొస్తోంది! నేను ఒక ఎలుగు బంటి వీపుచరిచాను" అన్నది.

ఆ తర్వాత బల్లమీద మేరీకి లారాకి, భోజనం పెట్టింది. కాని పా ఎంతకీ తిరిగి రాలేదు. లారా, మేరీ ప్రార్థన ముగించి, పక్కమీద పడుకున్నారు.

లాంతరు పక్కన పా చొక్కా కుడుతూ కూర్చుంది మా. పా లేకుండా ఆ ఇల్లంతా నిశ్శబ్దంగా, ఏదో కొత్తగా తోచింది.

చిట్టడవిలోని గాలి హోరు వింటూ పడుకుంది లారా. ఇంటిచుట్టూ వీస్తున్న ఆ గాలి చీకట్లో దారి తప్పినట్లు మూలుగుతోంది. ఆ గాలి హోరు వినేందుకు ఎంతో భయం కరంగా వుంది.

మా చొక్కా కుట్టడం పూర్తిచేసింది. దాన్ని జాగ్రత్తగా, నెమ్మదిగా మడిచి, చేతితో మృదువుగా నిమిరింది. ఆ తర్వాత తలుపు దగ్గరకి వెళ్ళి, బైట వాళ్ళెవరూ లోపలికి రాకుండా, గట్టిగా గడియ వేసేసింది. మా అంతకు క్రితం ఎప్పుడూ అలా గడియ బెట్టలేదు. ఆ తర్వాత మంచం దగ్గరికి వచ్చి నిద్రపోతున్న కారీని చేతిలోకి తీసుకుంది. లారా, మేరీ యింకా మేలుకునే వున్నారు. "పిల్లలూ! నిద్రపోండి. ఏమీ భయపడవలసింది లేదు. తెల్లారేటప్పటికి పా యింటికి వచ్చేస్తాడు" అంది మా. ఆ తర్వాత వూగుడు కుర్చీలో కూర్చుని, కారీని వొళ్ళో బెట్టుకుని, కుర్చీలో నెమ్మదిగా వూగటం మొదలుపెట్టింది. పా కోసరం ఎదురుచూస్తూ మా చాలాసేపు మేలుకునే వుంది. లారా, మేరీ కూడా మేలుకుందామనుకున్నారు గాని కాసేపయాక నిద్రపోయారు.

తెల్లారాక పా వచ్చేశాడు. వాళ్ళిద్దరికీ గౌనులు కుట్టుకునేందుకు చెరివొక పూలగుడ్డా, మిఠాయి పట్టుకొచ్చాడు. తెలుపు, నీలిరంగుపూలున్న గుడ్డ లారాకి యిచ్చాడు. ఎఱుపు, గోధుమరంగు చుక్కలున్న గుడ్డ మేరీకి యిచ్చాడు. మాకు కూడా ఒక పూలగుడ్డ తెచ్చాడు. గోధుమరంగు, తెల్లని పూలున్న ఆ గుడ్డ చాలా బాగుంది. తోళ్ళు చక్కగా అమ్ముడుపోయి, పా మంచి మంచి బహుమతులు తేగలిగినందుకు వాళ్ళంతా ఎంతో సంతోషించారు.

గాదెచుట్టూ ఎలుగుబంటి అడుగుజాడలున్నాయి. గాదె మీద ఎలుగుబంటి కాలి గోరు గుర్తులున్నాయి. కాని లోపలవున్న సుకీకీ, గుర్రాలకీ ఏమీ ప్రమాదం జరగలేదు. ఆ రోజంతా బాగా ఎండ కాసింది. మంచుగడ్డలు కరుగుతూనే వున్నాయి. పొద్దు పోయేలోపున ఆ, లేమకి ఎలుగుబంటి అడుగుజాడలు చెదిరిపోయాయి. రాత్రి భోజనం చేశాక, లారానీ,

లారా ఏడుపు మొదలెట్టింది. "అబ్బ! ఎలుగుబంటి సుకీని తినేస్తుందా?" అంటూ మా ని పట్టుకుని ఏడిచింది. "ఊహూ, సుకీ గాదెలోపల భద్రంగా వుంది. గాదెచుట్టూ పెద్ద దుంగలున్నవని గుర్తుంచుకో, గాదె తలుపు గట్టిగా మూసేసివుంది. ఆ తలుపులోంచి ఎలుగుబంట్లు లోపలికి పోలేవు. నా మాటవిను! ఆ ఎలుగుబంటి లోపలికెళ్ళి సుకీని తినలేదు" అంది మా లారాని దగ్గిరికి తీసుకుంటూ.

లారాకి కొంచెం ఉపశమనం కలిగింది. కాని వెంటనే "అయితే అది మనల్ని తినగలదా?" అనడిగింది. "మనల్ని అది ఏమీ చెయ్యలేదుగా! నేను చెప్పినట్లు విని నువ్వు వెంటనే పరుగెత్తు కొచ్చేయటం చాలా మంచి పనిచేశావు. ఎంచక్కా ఎందుకు? ఏమిటి? అంటూ చొప్పదంటు ప్రశ్నలెయ్యకుండా వచ్చేశావు "అని బుజ్జగించింది మా. మా కూడా భయంతో వణుకుతోంది. కాని కొద్దిగా నవ్వుతూ, "తలుచుకుంటే నవ్వొస్తోంది! నేను ఒక ఎలుగు బంటి వీపుచరిచాను" అన్నది.

ఆ తర్వాత బల్లమీద మేరీకి లారాకి, భోజనం పెట్టింది. కాని పా ఎంతకీ తిరిగి రాలేదు. లారా, మేరీ ప్రార్థన ముగించి, పక్కమీద పడుకున్నారు.

లాంతరు పక్కన పా చొక్కా కుడుతూ కూర్చుంది మా. పా లేకుండా ఆ ఇల్లంతా నిశ్శబ్దంగా, ఏదో కొత్తగా తోచింది.

చిట్టడవిలోని గాలి హోరు వింటూ పడుకుంది లారా. ఇంటిచుట్టూ వీస్తున్న ఆ గాలి చీకట్లో దారి తప్పినట్లు ఊళలుగుతోంది. ఆ గాలి హోరు వినేందుకు ఎంతో భయంకరంగా వుంది.

మా చొక్కా కుట్టడం పూర్తిచేసింది. దాన్ని జాగ్రత్తగా, నెమ్మదిగా మడిచి, చేతితో మృదువుగా నిమిరింది. ఆ తర్వాత తలుపు దగ్గిరకి వెళ్ళి, బైట వాళ్ళెవరూ లోపలికి రాకుండా, గట్టిగా గడియవేసేసింది. మా అంతకుక్రితమెప్పుడూ అలా గడియబెట్టలేదు. ఆ తర్వాత మంచం దగ్గిరికి వచ్చి నిద్రపోతున్న కారీని చేతిలోకి తీసుకుంది. లారా, మేరీ యింకా మేలుకునే వున్నారు. "పిల్లలూ! నిద్రపోండి. ఏమీ భయపడవలసింది లేదు. తెల్లారేటప్పటికి పా యింటికి వచ్చేస్తాడు" అంది మా. ఆ తర్వాత వూగుడు కుర్చీలో కూర్చుని, కారీని వొళ్లో బెట్టుకుని, కుర్చీలో నెమ్మదిగా వూగటం మొదలుపెట్టింది. పా కోసరం ఎదురుచూస్తూ మా చాలాసేపు మేలుకునే వుంది. లారా, మేరీ కూడా మేలుకుందామనుకున్నారు గాని కాసేపయాక నిద్రపోయారు.

తెల్లారాక పా వచ్చేశాడు. వాళ్ళిద్దరికీ గౌనులు కుట్టుకునేందుకు చెరివొక పూలగుడ్డా, మిఠాయి పట్టుకొచ్చాడు. తెలుపు, నీలిరంగువూలున్న గుడ్డ లారాకి యిచ్చాడు. ఎఱుపు, గోధుమరంగు చుక్కలున్న గుడ్డ మేరీకి యిచ్చాడు. మాకు కూడా ఒక పూలగుడ్డ తెచ్చాడు. గోధుమరంగు, తెల్లని పూలున్న ఆ గుడ్డ చాలా బాగుంది. తోళ్ళు చక్కగా అమ్ముడుపోయి, పా మంచి మంచి బహుమతులు తేగలిగినందుకు వాళ్ళంతా ఎంతో సంతోషించారు.

గాదెచుట్టూ ఎలుగుబంటి అడుగుజాడలున్నాయి. గాదె మీద ఎలుగుబంటి కాలి గోరు గుర్తులున్నాయి. కాని లోపలవున్న సుకీకీ, గుఱ్ఱాలకీ ఏమీ ప్రమాదం జరగలేదు. ఆ రోజంతా బాగా ఎండ కాసింది. మంచుగడ్డలు కరుగుతూనే వున్నాయి. పొద్దు పోయేలోపున ఆ, తేమకి ఎలుగుబంటి అడుగుజాడలు చెదిరిపోయాయి. రాత్రి భోజనం చేశాక, లారానీ,

తురీని ఒళ్లోకి తీసుకుని, పావాళ్ళకి ఓ కొత్తకథ చెప్పటం ప్రారంభించాడు.

"నేను పట్నం వెళ్ళినప్పుడు, ఆ మెతని మంచులో తోళ్లని బుజానవేసుకుని నడవటం కష్టంగా తోచింది. ఆలా కష్టపడి నడుచుకుంటూ వెళ్లేటప్పటికి చాలా ఆలస్యమయిపోయింది. మిగతా వాళ్ళంతా అంతకుముందే వెళ్లి పట్నంలో తోళ్ళు అమ్మటం ప్రారంభించేశారు. అందుకని నేను వెళ్ళిన సమయానికి దుకాణాదారుడు క్షణం తీరిక లేకుండా వున్నాడు. అతను నా తోళ్ళవంక చూడటానికే చాలాసేపు కాచుకోవలసి వచ్చింది. ఆ తర్వాత మేమిద్దరం ఒకొక్క తోలు ఖరీదే బేరం చెయ్యటం, నాకు కావలసిన వస్తువులు నేను ఏరుకోవటం ప్రారంభించాము. అందుకని బాగా పొద్దుపోయిన తరువాతగాని నేను యింటికి బయలుదేరలేక పోయాను. తొందరగా వచ్చేద్దామని ప్రయత్నించాను గాని, అలసిపోయివుండటం వల్ల గబగబ నడవలేకపోయాను. కాస్త దూరం నడిచానో లేదో అప్పుడే చీకటిపడిపోయింది. తుపాకీ లేకుండా చిట్టడివిలోకి వచ్చేశాను. ఇంకా అనుమైళ్ళు నడవవలసి వుంది. తొందర తొందరగా నడక ప్రారంభించాను. పోనుపోను చీకటి ఎక్కువయింది. చలికాలం గుహల్లో దాక్కున్న కొన్ని ఎలుగుబంట్లు బైటికి వచ్చేశాయని తెలుసు నాకు. ఎందుచేతనంటే పొద్దుట పట్నానికి వెళ్ళినప్పుడు చిట్టడివిలో వాటి అడుగు జాడలు కనుపించాయి. తుపాకీ తెచ్చుకోనందుకు అప్పుడు చాలా విచారించాను.

వేసంగిలో ఎలుగుబంట్లు అకలిగా, చిఱ చిఱ లాడుతుంటాయి. చలికాలమంతా ఆహారం లేకుండా గుహల్లోనే వుండటం మూలాన, బైటికి రాగానే బక్కచిక్కి, వెఱ్ఱి ఆక

లితో వుంటాయి ఎలుగుబంట్లు. అందుకని ఒక్క ఎలుగుబంటి కంటపడటం కూడా నాకు యిష్టం లేదు.

"ఆ చీకట్లో వీలయినంత తొందరగా అడుగులేయటం ప్రారంభించాను. కాస్సేపయాక, ఆకాశంలో కొద్దిగా నక్షత్రాలు కనపడ్డాయి. దట్టంగా చెట్లు ఉన్నచోట కన్ను పొడుచుకున్నా కనబడని చీకటి. కాని, అరుబయళ్ళలో కాస్త వెలుగ్గానే ఉంది. కొంతమేర దారి కనిపిస్తూనే ఉంది. ఆ చిక్కటి చీకట్లోంచి, అరుబయలులోకి వచ్చి, నక్షత్రాల వెలుగులో దారి కనుపించేటప్పటికి, నాకు ఎంతో సంతోష మేసింది. నడుస్తున్నంతసేపూ ఎలుగుబంట్లకోసరం ఎదురు చూస్తూనే ఉన్నాను. చెట్ల గుబురులలో తిరిగేటప్పుడు, అవి చేసే శబ్దంకోసరం చెవులు రిక్కించుకునే ఉన్నాను. అట్లా కాస్తదూరం వచ్చేసరికి, దారిలో మధ్యగా ఒక నల్లని ఎలుగు బంటి కనుపించింది. ఎలుగుబంటి వెనక కాళ్లమీద నిలబడి, నాకేసి చూసింది. దాని కళ్లు సంతృప్తితో మెరిశాయి. ఎలుగు బంటి ముట్టె, కాలిగోళ్ళుకూడా ఆ నక్షత్రాల వెలుగులో నాకు స్పష్టంగా కనిపించాయి.

నా ఒళ్ళంతా జెర్రెలుపాకినట్లయింది. భయంతో నా ఒంటిమీద వెంట్రుకలు లేచినిలబడ్డాయి. నడక ఆపేసి, నిశ్చేష్టుడనై నిలబడ్డాను. నాకేసి చూస్తూ' ఎలుగుబంటి ఎదురుగా నిలబడి ఉంది. దాన్ని తప్పించుకు పారిపోవటంవల్ల ప్రయోజనం లేదని నాకు తెలుసు. ఆ చీకట్లో అది నన్ను తప్పక తరుముకొస్తుంది. చీకటయినా, దాని కళ్లకి నేను కనపడి తీరుతాను. చలి కాలమంతా తిండిలేక ఆకలితో నకనకలాడుతున్న ఎలుగుబంటితో పోట్లాడటం నాకు ఏమాత్రం యిష్టంలేదు. అబ్బ! తుపాకీ తీసుకెళ్ళనందుకు ఎంత విచారించానని!

ఇంటికి రావాలంటే, ఆ ఎలుగుబంటి ముందునుంచే రావాలి. దాన్ని కాస్త భయపెడితే నాకు దోవ వదులుతుం

చేశాననిపించింది. అందుకని చేతులెత్తి, గట్టిగా కేకలు పెడుతూ దానివైపు పరుగెత్తాను. కాని అది కదలలేదు. కాస్తదూరం పరుగెత్తి, ఆగి దానివైపు చూశాను. అది యింకా నాకేసి చూస్తూనే ఉంది. మళ్ళీ అరిచి చూశాను. కాని అది కదల్లేదు. చేతులు ఊపుతూ, భయపెడుతూనే ఉన్నానుగాని అది కాస్తంతయినా బెదరలేదు.

ఇంక పరిగెత్తుకుపోయినా లాభంలేదనిపించింది. ఆ ఎలుగుబంటి కాకపోయినా, చిట్టడివిలో మరొక ఎలుగుబంటు యినా నాకు తటస్థపడక మానదు. అందుకని ఎలాగో అలాగ దాన్నే ఎదుర్కోవటం మంచిదనిపించింది. అదీగాక యింటి దగ్గర మా, మీరూ ఒంటరిగా ఉన్నారు. చిట్టడివిలో ప్రతిదీ చూసి భయపడి పరుగెడుతూ పోతే, తొందరగా యిల్లు చేరుకోలేను.

అందుకని చిట్టచివరికి ఓ పెద్ద చెట్టుకొమ్మను తీసుకున్నాను. మంచు పడటంమూలాన, ఆ కొమ్మ చెట్టునుంచి విరిగి కిందపడి ఉంది. దాన్ని రెండుచేతులతో ఎత్తి, ఎలుగుబంటి మీదికి దూకాను. వీలయినంత బలంగా ధభీమని ఎలుగుబంటి తలమీద కొట్టాను. కాని ఎలుగుబంటి ఏమాత్రం కదలిక లేకుండా అలాగే నిలబడింది. అది చాలా పెద్దదే. నల్లగా ఉంది. ఇంతకీ అది సగం కొట్టేసిన ఒక చెట్టు బోదె! పొద్దుట పట్నానికి వెళ్ళినప్పుడు దాని ముందునుంచే నడిచి వెళ్ళాను. ఎలుగుబంట్లు కనుపిస్తాయేమో అనే భయంతో వాటిని గురించే ఆలోచిస్తూండటంవల్ల, నాకు అది ఒక ఎలుగుబంటిలా కనుపించింది."

"ఇంతకీ అది ఎలుగుబంటి కాదా?" అనడిగింది మేరీ. "ఛా! అది ఎలుగుబంటి కాదు. అంతసేపూ చెట్టువంక చూస్తూ కేకలుపెట్టి, చేతులాడించి, ఉత్తినే పిచ్చిచేష్టలు చేశాను"

అన్నాడు పా. "మేము నిజమైన ఎలుగుబంటిని చూశాము. కాని అది నుకే అనుకోవటంవల్ల మాకు భయమేయలేదు" అన్నది లారా. పా లారాని దగ్గరగా తీసుకుని, గుండెలకి అదుముకున్నాడు. "అబ్బ! ఆ ఎలుగుబంటి నన్నూ, మా నీ తినేసి ఉండేది. మా దాని దగ్గరకెళ్ళి, వీపు చరిచింది. కాని అది ఏమీ చెయ్యలేదు. ఎందుకూరుకుందంటావు?" అంటూ లారా పా కి మరింత దగ్గరగా జరిగింది.

"బహుశః అది కాస్త బిత్తరపోయి ఉంటుంది. నా ఉద్దేశం ఏమిటంటే లాంతరు చూడగానే అది భయపడి ఉంటుంది. తర్వాత మా దగ్గరకొచ్చి, వీపు తడితే, మా ధైర్యస్తురాలని దానికి తెలిసి ఉంటుంది" అన్నాడు.

"మొత్తానికి నువ్వుకూడా భయపడలేదుగా? చెట్టు బోదె అయితేయేం, అది ఎలుగుబంటి అనే ధైర్యంగా కొట్టావుగా!" అన్నది లారా. ఇంతలో పడుకునేవేళయింది అని చెప్పింది మా. ఎట్లుని గౌన్లు తొడుక్కుని, మంచం పక్కనే మోకరిల్లి, వాళ్ళు ప్రార్థనచేయటం మొదలెట్టారు:

"భగవాన్! ఇప్పుడిక నేను పడుకుంటున్నాను,
దయతో నా ఆత్మని కాపాడు దేవా!
బహుశః ఈ నిద్దట్లోనే నేను చనిపోతే,
దయతో నా ఆత్మని కాపాడు దేవా!"

మా వాళ్ళిద్దరినీ ముద్దెట్టుకుని, దుప్పటి కప్పింది. సూదీ, దారం తీసుకొచ్చింది. పూలగుడ్డమీద సూది టక్ టక్ మనే శబ్దం చేస్తోంది. మా బుజాలమీద పడుతున్న జుత్తు, గౌను కుడుతున్న మృదువైన వేళ్ళూ, చూస్తూ పడుకున్నారు లారా, మేరీ.

పా బూట్లకు మెఱుగు పెడుతున్నాడు. పా గోధుమ రంగు జుత్తు, మీసాలు, గడ్డం ఆ లాంతరు వెలుగులో పట్టు కుచ్చులా కనిపించాయి. అతని గళ్ళ గళ్ళ చొక్కా రంగు బలే చక్కగా వుంది. బూట్లకి మెఱుగు పెడుతూ సంతోషంతో ఈల వేశాడు పా. వెంటనే,

"ఉదయాన్నే పక్షులు గానం చేస్తున్నాయి,
పూవులు, మొగ్గలు విచ్చుకుంటున్నాయి,
కొండ అవతల సూర్యుడు ఉదయిస్తున్నాడు,
అప్పుడే నేను ఆ మెని సమాధి చేశాను."

అంటూ పాడటం ప్రారంభించాడు. ఆ రోజు రాత్రి ఎంతో వెచ్చగా ఉంది. పొయిలో నిప్పు ఆరిపోయింది గాని పా దాన్ని మళ్ళీ వెలిగించలేదు. చిట్టడవిలోని ఆ చిన్న యింటి చుట్టూ, మంచు కురుస్తున్న చిన్న శబ్దాలు తప్ప మరేమీ వినిపించటం లేదు.

ఇంక కొద్దిరోజుల్లోనే, చెట్లనిండా లేత ఆకుపచ్చ, పసుపు పచ్చ, గులాబీ రంగు చిగురుటాకులు మొలుస్తాయి. చిట్టడవినిండా, కొల్లలు కొల్లలుగా పూలు, పక్షులు కనిపిస్తాయి. వసంత కాలం వచ్చేయటంవల్ల, లారా మేరీ రోజంతా చెట్లమధ్యనే ఆడుకుంటూ ఉంటారు. ఇక రాత్రిళ్లు చలి కాచుకుంటూ కథలు చెప్పుకోవటానికి తీరుబడే ఉండదు.

# 5

చాలా రోజులపాటు, మంచి ఎండ కాచి, వాతావరణమంతా వెచ్చగా వుంది. పొద్దుట లేవగానే కిటికీలమీద మంచు వుండేది కాదు. రోజంతా మంచు గడ్డలు కరిగి కింద పడే శబ్దం వినిపించేది. చెట్ల కొమ్మలు కదిలి, వాటిమీంచి మంచు ముద్దలు కింద పడేవి.

కిటికీ అద్దానికి ముఖం ఆనించి చూస్తే, బైట కొమ్మల మీంచి, ఆకులనుంచీ మంచు బొట్లు రాలటం కనుపించేది లారాకి, మేరీకి. చెట్లమీంచి కిందవున్న గోతుల్లో పడేవి ఆ మంచు బొట్లు. మిల మిల మెరవకుండా, వెలవెల బోతుండేవి. ఇంటి వెనక కుండులో మంచంతా బాగా తగ్గిపోయింది.

ఇంతలో ఓ రోజు లారాకి తోటలో ఓ పక్కగా మట్టినేల కనుపించింది. క్రమంగా అలా మొత్తం పెరడంతా

మంచు లేకుండా శుభ్రమయిపోయింది. సాయంత్రం లోపు, యింటి చుట్టూ మట్టి తయారయింది. గంట దగ్గిర మటుకు అక్కడక్కడ మంచు నిలిచివుంది. "నేను బైటికి పోయి ఆడుకోకూడదా?" అడిగింది లారా. "ఆడుకోవచ్చు" అంది మా. "అయితే వెళ్ళనా?" అని మళ్ళీ అడిగింది లారా. "రేపు వెళుదువు గానిలే" అంటూ మాట యిచ్చింది మా.

ఆ రోజు రాత్రి చలికి వణికి పోతూ నిద్ర లేచింది లారా. దుప్పటి అసలు కప్పుకున్నట్లే లేదు. చలివేసింది. మా యింకో బొంత తీసుకొచ్చి కప్పి, "మేరీ దగ్గరగా జరుగు. వెచ్చగా వుంటుంది" అంది.

పొద్దు టయేటప్పటికి, పొయి వెలిగించటం వల్ల యిల్లంతా వెచ్చగా వుంది. కాని లారా కిటికీలోంచి బైటికి చూసేటప్పటికి, నేల నిండా మళ్ళీ దట్టంగా మంచు పేరుకు నుంది. చెట్ల కొమ్మలనిండా పక్షి రెక్కలకి మల్లె మంచు కనిపించింది. కంచె మీదంతా మంచు కుప్పలుగా పేరుకు పోయింది. వీధి దీపాలమీద తెల్లటి బంతులకి మల్లె మంచు గడ్డలు వున్నాయి.

బుజాలమీద మంచు దులుపుకుని, బూటు కాలుకింద వేసి నొక్కుతూ, పా లోపలికి వచ్చాడు. "ఇది తియ్యని మంచు" అన్నాడు. లారా వెంటనే అతని చేతిమీద మంచు నాకి చూసింది. లారా నోట్లో అది మంచులాగే కరిగి పోయింది. తను ఆ తియ్యటి మంచు రుచి చూడటం ఎవరూ చూడనందుకు లారా చాలా ఆనంద పడింది. "మంచు తియ్యగా ఎందుకుంది?" అనడిగింది పా ని. ఆ సంగతంతా వివరించటానికి తనకి వ్యవధి లేదనీ, తాతయ్య యింటికి వెళ్ళా లనీ చెబుతూ పా గబగబ వెళ్ళిపోయాడు.

చిట్టడవిలో ఎంతో దూరాన వున్నాడు తాతయ్య. అక్కడ ఎన్నో రకాల చెట్లు గుబురుగా పెరిగి వుండేవి.

పా వెళ్ళిపోతుంటే, లారా కిటికీ దగ్గరకెళ్ళి, తొంగి చూసింది. పా బలంగా, భారీగా వున్నాడు. మంచులో పెద్ద పెద్ద అంగలేసుకుంటూ యింటినుంచి బయలుదేరాడు. భుజాన తుపాకీ వేళ్ళాడుతోంది. కాళ్ళకి పొడుగాటి జోళ్ళున్నాయి. అవి మంచులో పెద్ద గుర్తులుగా పడ్డాయి. కనుచూపు మేర వరకూ పా వెళ్ళటం చూస్తూ నిలబడింది లారా.

ఆవేళ అతను యింటికి తిరిగి వచ్చేటప్పటికి బాగా చీకటి పడింది. మా అప్పుడే లాంతరు వెలిగించింది. ఒక చేతిలో పెద్ద పొట్లం యింకో చేతిలో పెద్ద కొయ్య తొట్టె పట్టుకుని వచ్చాడు పా. "కారలిన్! ఇంద" అంటూ ఆ మూట, తొట్టె మా చేతికందించాడు. తర్వాత తుపాకీని తలుపు పైన మేకుకి తగిలించాడు. "ఇవాళ గనుక ఎలుగుబంటి కనపడుంటే దాన్ని చంపేందుకు ఈ పొట్లాన్ని కింద పడేసి వుండేవాణ్ణి," అంటూ నవ్వాడు పా. "నిజానికి నేను ఈ బరువుని కింద పడేసి వుంటే ఎలుగుబంటిని చంపవలసిన అవసరం లేకపోయేది. ఎలుగుబంటి పొట్లంలోనివి రుచి చూస్తుంటే, నిలబడి దాన్ని చూస్తూ వుండిపోయేవాణ్ణి" అన్నాడు మళ్ళీ.

మా మూట విప్పింది. దాంట్లో రెండు గట్టి, గోధుమ రంగు కేకులున్నాయి. ఒక్కొక్క కేకు పాలు పోసుకునే సోలంత వున్నది. తొట్టె తెరిచి చూస్తే, దానినిండా నల్లని పానకం వుంది. "లారా! మేరీ యిందా తీసుకోండి" అంటూ జేబులోంచి చెరివొక పొట్లం తీసి యిచ్చాడు వాళ్ళకి. కాయితాలు తీసేసి చూస్తే, లోపల చిన్నటి గోధుమ రంగు కేకులున్నాయి. చుట్టూ వంపులు వంపులుగా తిరిగి ఆ కేకులు చూట్టా

నికి బలే చక్కగా వున్నాయి. తినండి" అంటూ పా వాళ్ళ కేసి ప్రేమగా చూశాడు. కర కరలాడుతూ ఆ కేకులు ఎంతో తియ్యగా వున్నాయి. నిజానికి క్రిస్‌మస్ మిఠాయి కంటె కూడా రుచిగా వున్నాయి. "ఇవి గంగిరేణుచెట్టు రసంతో చేశారు." అన్నాడు పా.

భోజనం తయారవగానే లారా, మేరీ తమ పళ్ళాల పక్కనే కేకుల్ని పెట్టుకున్నారు. పానకాన్ని రొట్టెమీద పోసుకుని తిన్నారు. భోజనమయాక పా వాళ్ళని ఒళ్ళో కూర్చోబెట్టుకుని, తన తాతయ్య యింటి దగ్గర గడిపిన సంగతులూ, తీపి మంచుని గురించీ చెప్పాడు.

"చలికాలమంతా తాతయ్య తొట్టెలు చేస్తూ గడిపాడు. పానకం పోస్తే చెడిపోకుండా వుండేందుకని, ఆ దేవదారు చెట్టు కొయ్యతో వాటిని తయారు చేశాడు. ముందు నా చెయ్యంత రెండు పెద్ద కొయ్య ముక్కల్ని పెట్టి దాని చుట్టంతా నా వేళ్ళంతటి కొయ్య ముక్కలని పెట్టాడు. పైన ఒక కర్రని వొంచి తొట్టికి రెండు పక్కలా సందులు చేసి, దారంతో కట్టాడు. వొంగిన కొయ్య తొట్టె పట్టుకునేందుకు వీలుగా తయారయింది. తర్వాత కత్తి తీసుకుని లోపలంతా నున్నగా చెక్కేసి, తొట్టెలా చేసేశాడు. ఆ విధంగా చలికాలం పోయి, చెట్లల్లో నీరు ఊరటం ప్రారంభించేసరికి అలా ఎన్నో తొట్టెలను తయారు చేసేశాడు.

ఆ తర్వాత చిట్టడివిలోకి వెళ్ళి, ఒక్కొక్క గంగిరేణు చెట్టుకి సందు చేసి, గొడ్డలితో అందులో ఒక కొయ్యని కొట్టి, దానికి తొట్టిని తగిలించేవాడు.

చెట్టుకి నీరు ఆహారం లాంటిది. వేసంగి వస్తూనే, చెట్ల వేళ్ళలోంచి ఆ నీరు పైకి పాకుతుంది. ఒక్కొక్క కొమ్మకీ, ఆకుల్లోకి పారి, చెట్టు పెరిగేందుకు తోడ్పడుతుంది.

"సరిగ్గా గంగిరేణి చెట్టులో పూట ఆ సందుదగ్గర కొచ్చేసరికి, కిందకి కారి ఆ తొట్టిలో పడేది."

"అలా సందు చేయటం వల్ల చెట్టుకి బాధ పెట్టదూ?" అనడిగింది లారా, "అబ్బ! కాస్త మన వేలుకి దెబ్బకి తగిలి, రక్తం కారినట్లై చెట్టుకి నొప్పెడుతుంది" అన్నాడు పా.

"రోజూ పొద్దున్నే తాతయ్య కోటు, వూలు టోపీ, బూట్లు తొడుక్కుని, పానకం తెచ్చేందుకు చిట్టడవిలోకి వెళ్ళేవాడు. ఒక కట్టెబండీమీద పెద్ద పీపా పెట్టుకుని, ఒక్కొక్క చెట్టు దగ్గరికే వెళ్ళి, పానకం తీసుకుని ఆ పీపాలో పోస్తాడు. ఆ తర్వాత రెండు చెట్ల మధ్య పెద్ద దుంగ పెట్టి, బరువైన గొలుసులతో దానికి ఒక పెద్ద గిన్నె కడతాడు. ఈ పీపాని ఆ గిన్నె దగ్గరికి తీసుకెళ్ళి, యిదంతా దాంట్లో పోస్తాడు. తర్వాత కింద మంట పెట్టి, ఆ పాన కాన్ని కాగ బెడతాడు. మంట ఎక్కువయితే పానకం బాగా ఉడికిపోతుంది. అలా కాకుండా సమపాళంగా మంట పెట్టి, దాన్ని జాగ్రత్తగా కనిపెట్టి వుండేవాడు తాతయ్య.

రెండుమూడు నిముషాల కొకసారి ఆ పానకాన్ని కలియబెడుతూ వుండాలి. ఒక పొడుగాటి, పెద్ద కొయ్య గరిటెతో పానకాన్ని కలిపేవాడు తాతయ్య. పానకం బాగా ఉడికిపోకుండా తాతయ్య గరిటెతో దాన్ని పైకి తీసి మళ్లా కిందపోస్తూ వుండేవాడు. అందువల్ల పానకం కాస్త చల్లబడి త్వరగా ఉడికిపోకుండా వుంటుంది. పానకం సమంగా వేడి పడేటప్పటికి, దాన్ని తొట్టెల్లో నింపేవాడు. ఆ తర్వాత దాన్ని కాస్సేపు ఒక పళ్ళెంలో చల్లారపెట్టి, ముక్కలుగా కోసి గడ్డ కట్టేంతవరకూ పొయిమీద పెడతాడు. సరిగ్గా అది గడ్డ కట్టుకునే సమయానికి, వాటిని పాలల్లో కలుపుతాడు. పాలవబ్బాలు పొయి పక్కనే సిద్ధంగా పెట్టు

కుంటాడు. ఆ పాలల్లో అది గట్టిగా, గోధుమరంగు కేకు లకి మల్లె తయారవుతుంది.

"అయితే తాతయ్య చేస్తున్నది తియ్యమంచా?" అనడిగింది లారా. "ఊహు, ఈ ఋతువులోనే మనం పానకం చేయటానికి వీలుంది కాబట్టి దీన్ని తీయటి మంచు అంటారు. ఇంకా చలి, మంచు కొద్దిగా వుండటం మూలాన, చెట్లు తొందరగా విచ్చుకోవు. దాంతో చెట్లలో పూట ఎక్కువగా ప్రవహిస్తుంది. మంచు యింకా మిగులుతుండటం వల్ల, పానకం చేయటానికి వీలవుతుంది. కాబట్టి దీనికా పేరు వచ్చింది."

చెట్లలో బాగా పూట చేరితే, తాతయ్య సంవత్సరం పొడుగుతా సరిపోయే పానకం తయారుచేస్తాడు. పట్నానికి తోళ్ళు తీసుకెళితే ఎక్కువ చక్కెర పట్టుకు రావలసిన అవసరం లేదు. ఎవరైనా అతిధులు వచ్చినప్పుడు బల్లమీద పెట్టేందుకు కొద్దిగా చక్కెర పట్టుకొచ్చి నిలవచేసేవాడు."

"అలా పానకం చేయగలందుకు తాతయ్యకి ఎంతో సంతోషంగా వుండుండాలి కదూ!" అడిగింది లారా, "అవును. వచ్చే సోమవారం మళ్ళా పానకం చేయటానికి వెళతాడు. మనందరినీ రమ్మన్నాడు." అన్నాడు పా. ఆ శుభవార్త అఖర్న చెబుదామని ఆగాడు పా. అతని కళ్లు సంతోషంతో మిల మిల లాడాయి. "కారలిన్! అక్కడ నృత్యం కూడా చేస్తారు" అన్నాడు. మా ముఖం సంతోషంతో వికసించింది. కాస్సేపు కుడుతున్న గుడ్డ కిందపెట్టి, "నిజంగా నా చార్లిన్!" అంది చిన్నగా నవ్వుతూ, "అయితే నేను ఆ రోజు పూలగౌను తొడుక్కుంటాను" అంది మా మళ్ళా కుట్టు ప్రారంభిస్తూ.

మా పుట్టిల్లు తూర్పువైపున వుండేది. పెళ్ళి కాకముందు మా ఎంతో నవనాగరీకంగా అలంకరించుకునేది. గౌన్లు ఒక దర్జీచేత కట్టించుకునేది. ముదురు ఆకుపచ్చరంగు, మధ్యనంతా పూలువున్న ఆ గౌన్ మా పుట్టింట్లో కుట్టించుకున్నది. వివాహమయాక పడమటివైపున వున్న విన్సు కాసిన్ లోని చిట్టడవిలోకి వచ్చేసింది మా.

ఆ గౌనుని కాయితంలోచుట్టి దాచేసింది మా. ఎన్నడూ మా దాన్ని తొడుక్కోగా లారా, మేరీ చూడలేదు. కాని ఒకసారి మా దాన్ని వాళ్ళకి చూపించింది. గౌను ముందు ఎర్రటి సిల్కు బొత్తాములని వాళ్ళు ముట్టుకుచూశారు. లోపలవైపు దగ్గిర దగ్గిరగా వున్న కుట్లనీ చూశారు. కనుక మా అంత చక్కని గౌను తొడుక్కో బోతోందంటే, నృత్యం చాలా గొప్పదయివుండాలను కున్నారు లారా, మేరీ. వాళ్ళ ఉత్సాహానికి పట్టపగ్గాలులేవు. పా ఒళ్ళో ఎగిరిపడుతూ, నృత్యాన్ని గురించి ఒకటే ప్రశ్నలడగటం మొదలుపెట్టారు. చిట్టచివరికి పా, "సరే! ఇక వెళ్ళి పడుకోండి. ఆ నృత్యానికి వెళ్ళినప్పుడు దాని సంగతంతా బాగా తెలుస్తుంది. నేను యింక సితారకి కొత్త తీగ వేసుకోవాలి" అంటూ వాళ్ళని పంపించేశాడు.

చేతులు, ముఖం, శుభ్రంగా కడుక్కుని, ప్రార్థనలు ముగించి, పక్కమీదికి చేరారు లారా, మేరీ. ఇంతలో సితార తీసుకుని, కాలితో తాళం వేస్తూ పాట ప్రారంభించాడు పా:

"నేను హార్స్ మెరీన్సు నాయకుడు జింక్సుని,"
"నేను నా గుఱ్ఱానికి మొక్కజొన్నలు,
బీన్సు పెడతాను,
"హార్సు మెరీన్సు సైన్యానికి నాయకుణ్ణి కాబట్టి,
"నేను నా శక్తికి మించిన ఖర్చు చేసేవాణ్ణి,"

# 6

తాతయ్య యింటికి వెళ్ళాలనే తొందరలో సోమ వారం పెందరాళే అందరూ నిద్రమేలుకున్నారు. కాస్త ముందుగానే బయలుదేరి వెళ్లి, పానకం చేయటంలో తాత య్యకి సాయం చేద్దామనుకున్నాడు పా. ఆవేళ నృత్యంచేయ టానికి వచ్చే వాళ్ళందరికీ అన్నం వండటంలో, నాన్నమ్మకి సాయపడదామను కుంది మా.

పొద్దున్నే లేచి, ఫలహారం చేసి, గిన్నెలన్నీ కడిగేసు కుని, పక్కలు సర్దేశారు. పా తన సితారని ఒక పెట్టెలో భద్రంగా పెట్టి, బండీలో పెట్టాడు. అప్పటికే గుమ్మం దగ్గర బండీ కాచుకునుంది.

బైటంతా చలి చలిగా, మంచుగా వుంది. మా, మేరీ, లారా, చిన్ని చెల్లాయి కారీ, గుప్పట్లు కప్పుకొని బండీలో

ఎక్కారు. గుఱ్ఱాలు తలలు విదిలించి, పరుగెత్తటం ప్రారంభించాయి. గుఱ్ఱం మెళ్ళో గజ్జలు గల గల మని శబ్దం చెవుల కెంతో యింపుగా వుంది. ఆ విధంగా యింకా బాగా తెల్ల వారకముందే, చిట్టడవిలోంచి వాళ్లు తాతయ్య యింటికి వెళ్ళారు. రోడ్డుమీద మంచు నున్నగా, తడితడిగా వుంది. వాటిమీదగా బండిచక్రాలు సునాయాసంగా వెళ్లిపోయాయి. బండీ వేగంగా పోతుంటే, రోడ్డు పక్కలవుండే చెట్లు, బండీతో పోటీపడి పరుగిడుతున్నాయా అనిపించింది.

కాస్సేపయాక సూర్యుడు ఉదయించాడు. చిట్టడవి అంతా కాంతివంతం అయిపోయింది. చెట్ల ఆకులగుండా బంగారు వర్ణం సూర్యకిరణాలు ప్రసరించాయి. మంచంతా లేతగులాబీ రంగులోకి మారిపోయింది. చెట్ల ఆకుల, కొమ్మల నీడలన్నీ నీలిరంగులో రోడ్డుమీద పడ్డాయి. ఆ సూర్యోదయ దృశ్యం ఎంతో మనోహరంగా వుంది.

లారాకీ, మేరీకీ, రోడ్డుపక్కన క్రూరమృగాల అడుగు జాడలు చూపించాడు పా. రోడ్డుకి రెండువైపులా ఉడతలు, ఎలుకలు, పక్షుల చిన్న చిన్న అడుగుజాడలు కూడా వున్నాయి. అంతే కాదు; కుక్కలు, నక్కలు, లేడిపిల్లల పెద్ద పెద్ద అడుగుజాడలు కూడా వున్నాయి ఆ దారిలో.

చలివేయటం మానేసి, వాతావరణం కాస్త వెచ్చగా తయారయింది. పా యిక ఆట్టే సేపు మంచు కురవదని చెప్పాడు.

కొద్దిసేపట్లోనే వాళ్లు తాతయ్య యింటికి చేరారు. నాన్నమ్మ గుమ్మం దగ్గరకొచ్చి నిలబడి, వాళ్లని లోపలికి రమ్మని పిలిచింది.

అప్పటికే తాతయ్యా, జార్జి పెదనాన్న గంగిరేణిచెట్ల దగ్గరికి వెళ్ళిపోయారని చెప్పింది నాన్నమ్మ. అది వినగానే పా వెంటనే చిట్టడవిలోకి వెళ్ళిపోయాడు. తతిమావాళ్లంతా నాన్నమ్మతో యింట్లోకి వెళ్ళి, పైన దుప్పట్లు తీసేశారు.

లారాకి నాన్నమ్మ యిల్లు ఎంతో నచ్చింది. వాళ్లింటి కంటే అది పెద్దది, ముందు ఒక పెద్దగది, దానిపక్కన పెద్దనాన్నకి ఒక చిన్న గది, అత్తయ్యలకి, మరోచిన్నగది, తర్వాత వంటయిల్లు, సామాన్ల గదీ వున్నాయి. ముందు పెద్ద గదిలో కిటికీల కిందగా నాన్నమ్మ మంచం వుంది. పరుగెత్తి ఆడుకోవటానికి విశాలంగా బాగుంది ఆ గది. ఆ గదిలో కింద నేలంతా కొయ్యపలకతో తయారు చేయబడింది. తాతయ్య గొడ్డలితో దుంగలని కొట్టి, ఆ గట్టి పలకల్ని పట్టుకొచ్చాడు. తర్వాత వాటిని నున్నగా చెక్కి, శుభ్రంగా తుడిచేశాడు. ఆ నేల నిగ నిగ లాడుతూ అందంగావుంది. నాన్నమ్మ పరుపు మెత్తగా బాగుంది.

వంటయింట్లో నాన్నమ్మ, మా, అత్తయ్యలు అన్నం వండుతుంటే, ఆ పెద్దగదిలో లారా, మేరీ ఆటలు ప్రారంభించారు. ఎంతసేపు ఆడుకున్నా వాళ్లకి తృప్తి అనిపించలేదు. గడియారం వేగంగా పరుగెత్తి పోతున్నట్లనిపించింది. మగ వాళ్లు అడవిలోకి వెళ్ళేటప్పుడే భోజనాలు మూటకట్టుకు తీసుకుపోయారు. అందుకని ఆ పూట పాలు, చల్లటి రొట్టె తిన్నారు వాళ్లు. కాని రాత్రిభోజనానికి నాన్నమ్మ పిండి వంటలు తయారుచేయటం మొదలెట్టింది.

నాన్నమ్మ పొయిపక్కనే నిలబడి, ఉడుకునీళ్ళల్లో ఉప్పేసి, దాంట్లో జొన్నలు వేసింది. నీళ్లల్లో వాటిని పోస్తున్నంత సేపూ ఒక పెద్ద కొయ్యగరిటెతో కలుపుతూ వచ్చింది. నీళ్ళూ, జొన్నలూ బాగా కలిసిన తర్వాత,

పొయ్యి వెనకాతల ఒక గిన్నెలో వేసేది. ఎక్కువ సెగ లేకుండా పొయివెనకాల అది నెమ్మదిగా ఉడికేది.

వంటలు జరుగుతున్నంతసేపూ యిల్లంతా ఘుమ ఘుమ లాడేది. అంతే కాదు; పొయిలో మండుతున్న దేవదారు చెట్టు కట్టెలు, అమ్మమ్మ బల్లమీద అకిల్ పండు, మంచి వాసన కొట్టేవి. కిటికీ అద్దాలగుండా లోపలికి వెలుగు పడేది. ఆ యిల్లంతా విశాలంగా, వెలుగ్గా, శుభ్రంగా వుంది.

రాత్రి భోజనాల సమయానికి, పా, తాతయ్య చిట్టడవినుంచి తిరిగివచ్చేశారు. ఇద్దరికీ బుజాన కొయ్యకర్రలున్నాయి. మెడదగ్గిర వెడల్పుగానూ, బుజాలదగ్గిర సన్నగానూ వుండేట్లు ఆ కర్రలని చెక్కాడు తాతయ్య. ఆ కర్రలకి రెండువైపులా అంచుల్న గొలుసు ముడేశాడు. ఆ గొలుసులకి పానకం పోసిన పెద్ద కొయ్యతొట్టెల్ని తగిలించాడు. ఆ తొట్టెల్ని చేతితో ఎత్తేందుకు ప్రయత్నించారు గాని అవి చాలా బరువుగా వున్నాయి. అందుకని వాటిని కర్రకికట్టి బుజాలకి తగిలించుకున్నారు.

నానమ్మ పొయిమీద పెద్ద ఇత్తడిగిన్నె పెట్టింది. ఆ గిన్నెలో నాలుగు తొట్టెల పానకం పోసింది. ఇంతలో పెద్దనాన్న మరో చిన్న తొట్టెనిండా పానకం తీసుకువచ్చాడు. ఆ తర్వాత అంతా కలసి పానకం పోసుకుని వేడి వేడి పిండి వంటలు తిన్నారు.

పెద్దనాన్న అప్పుడే యుద్ధంనుంచి యింటికి తిరిగి వచ్చాడు. నీలిరంగు సైనికుల కోటు, దానిమీద ఇత్తడి బొత్తాములు, గంభీరమైన ముఖం, చూట్టానికి దర్జాగా భారీగా పొడుగ్గా వుండేవాడు పెద్దనాన్న. వూగుతూ నడిచేవాడు.

పా ఒకసారి మాతో పెదనాన్న కోపిష్టి అని చెప్పంగా వింది లారా. అందుకని భోజనం చేస్తున్నంతసేపూ, పెద్ద నాన్న కేసే చూస్తూ కూర్చుంది. "యుద్ధంనుంచి వచ్చినప్పటి నుంచీ అన్నయ్య మొరటుగా తయారయ్యాడు." అన్నాడు పా బాధగా తల ఆడిస్తూ. యుద్ధంలో నగారా మోయించే కుర్రాడిగా పద్నాలుగేళ్ళప్పుడే యింటిదగ్గరనుంచి పారి పోయాడు పెద్దనాన్న. నిజానికి అందుకనే అలా మొరటు తేలాడు. లారా అంతకు ముందెప్పుడూ పెద్దనాన్నంత మొరటు మనిషిని చూడలేదు. కాని అతనంటే తనకి భయమో కాదో నిర్ణయించుకోలేక పోయింది.

భోజనాలయాక పెద్దనాన్న గుమ్మంబైట నిలబడి నగారా వాయించాడు. అది చాలా పెద్ద నగారా. పొడుగ్గా వుంది. చిట్టడవి అంతా వ్యాపించేట్లు దాంట్లోంచి పెద్ద శబ్దం వచ్చింది. కాని ఆ వాయింపు విన యింపుగా ఎంతో హాయిగా వుంది. ఆ నిశ్శబ్దత చూస్తే అడవిలోని చెట్లు, రాళ్ళు, సంగీతం వింటున్నాయా అనిపించింది. తర్వాత దూరాన, ఎంతో మృదువుగా ఆ పాట ప్రతిధ్వని వినిపించింది. "ఆ ప్రతిధ్వని వినండి. బాగుంది కదూ!" అన్నాడు పెద్దనాన్న. లారా తల ఎత్తి అతని ముఖంలోకి చూసింది. కాని పాట పూర్తవ గానే యింట్లోకి పరుగెత్తింది. నాన్న మ్మా, మా కలిసి వంటిల్లు కడిగి గిన్నెలన్నీ తోమేశారు. తర్వాత పోయి శుభ్రంచేశారు. అత్తయ్య లిద్దరూ తమ గదుల్లో చక్కగా అలంకరించు కోవటం ప్రారంభించారు.

అత్తయ్యలది బాగా పెద్ద జుత్తు. పాయలు పాయలుగా తీసి, వాళ్ళు జుత్తు దువ్వుకుంటుంటే లారా మంచంమీద వాళ్ళని చూస్తూ కూర్చుంది.

వంటయింట్లో బల్లమీద ఒక గిన్నె పెట్టి దాంట్లో సోపుతో ముఖం, చేతులు కడుక్కున్నారు వాళ్ళు. కో[illegible]

వాడుకునేందుకు నాన్నమ్మ ఒక కూజాలో గోధుమరంగు సోపు వుంచేది. ముఖం కడుక్కునేందుకు ఆ సోపు కాకుండా వేరే నిలవ వుంచిన సోపు వాడేవారు అత్తయ్యలు. గోడమీద ఒక చిన్న అద్దము తగిలించేవారు. ఒక అత్తయ్య చేతితో అద్దం దగ్గిర లాంతరు పట్టుకు నిలుచునేది. ఇంకో అత్త అద్దంలో చూసుకుంటూ గబగబ జుత్తు దువ్వుకునేది. దీపం వెలుగులో పాపిడి దగ్గిర తెల్లగా మెరిసి పోయేట్లు జుత్తు నున్నగా దువ్వేవారు. తర్వాత వెనక పెద్ద ముడి వేసుకుని, ముందు జడలుగా అల్లినజుత్తుని రెండు పక్కలనుంచి అందంగా ఆ ముడిలోకి దోపేవారు. లేసు దారంతో అల్లిన తెల్ల మేజోళ్ళు తొడుక్కుని, వాటిమీద బూట్లు వేసుకునేవారు. తరవాత బిగుతుగా వుండే రవికలు తొడుక్కునేవారు. రవిక ముళ్లు గట్టిగా బిగించుకునేందుకు ఒకరికొకరు సాయం చేసుకునేవారు. "కారలిన్ నడుం చాలా సన్నగా వుంటుంది. పెళ్ళయిన కొత్తలో చార్లెస్ ఆ నడుం తన వేళ్ళతో కొలిచే వాడుట" అనేది డోసియా అత్త తల్లిని గురించి వాళ్ళు గొప్పగా చెప్పుకోవటం విని లారా గర్వపడింది.

తర్వాత రుబీ, డోసియా అత్తలు, చుట్టూ లేసు అల్లిన కోట్లు వేసుకున్నారు. ఇంకా చక్కటి దుస్తులు అలంకరించుకున్నారు. ముదురు నీలిరంగు మీద ఎఱ్ఱటి పూలు, ఆకుపచ్చ ఆకులు వున్న పూల గౌను తొడుక్కుంది డోసియా. ఆ గౌను ముందరి భాగమంతా నల్లటి బొత్తాములున్నాయి. ద్రాక్షపండు రంగు గుడ్డమీద లేత ద్రాక్షపండు రంగు గళ్లు వున్న గౌను తొడుక్కుంది రుబీ. ఆ గౌనుకి బంగారు రంగు బొత్తాము లున్నాయి. ఒక్కొక్క బొత్తాము పైన చెట్ల ఆ కారంలో ఒక తోట బొమ్మ వుంది. డోసియా మెడ దగ్గిర ఒక గుండ్రని పెద్దపిన్ను పెట్టుకుంది. ఆపిన్నుని రుబీ స్వయంగా తయారు చేసింది. వాళ్ళు తొడుక్కున్న గౌన్లు అందంగా నేల వరకూ పడుతున్నాయి. సన్నని నడుములూ,

గులాబీరంగు చెక్కిళ్ళు, చురుకైన కళ్ళు, నల్లటి మెత్తని జుత్తు వాళ్ళు చాలా ఆకర్షణీయంగా వున్నారు. మా కూడా ఆ పూలగౌను తొడుక్కుని అందంగా తయారయింది. మెడుదు ఆకుపచ్చ రిబ్బనుతో గౌనంతా చిన్న చిన్న ముళ్ళు వేసు న్నాయి. అమ్మ మెడకిదగ్గర ఒక బంగారు పిన్ను పెట్టుకుంది. లారా వేళ్ళంత ఎత్తున, అంచుల్లో గుల్లచేప ఆకారంలో పిన్ను అంతా అందంగా చెక్కివుంది. వాటిన అలంకరించుకున్న మా ఒక భాగ్యవంతుల స్త్రీకి మల్లె కనుపించింది. లారాకి మా ని ముట్టుకు నేందుకె భయమేసింది.

అతిథులు ఒక్కొక్కరే రావటం ప్రారంభించారు. కొందరు లాంతర్లు పట్టుకుని కాలిబాటన నడుచుకుంటూ వచ్చారు. కొందరు గుర్రంబండీలలోనూ, కొందరు మామూలు బళ్ళలోనూ వచ్చారు. బైట ఎడతెరిపి లేకుండా గుర్రం గజ్జల చప్పుడు వినిపిస్తూనే వుంది.

ఇల్లంతా జోళ్ళతోనూ, ఇటూ, అటూ తిరుగుతున్న జనంతోనూ నిండిపోయింది. నాన్నమ్మ మంచంనిండా వరు సగా పాపాయిల్ని పడుకోబెట్టారు. జేమ్సు పెద్దనాన్న, లిబ్బీ పెద్దమ్మా, వాళ్ళ చిన్నపిల్లని వెంటబెట్టుకు వచ్చారు. ఆ అమ్మాయి పేరు కూడా లారా ఇంగాల్సు. ఇద్దరు లారాలూ మంచంమీద ఒంగి, పాపాయిల్ని చూశారు. లారా ఇంగాల్సు కారీ కంటె తన చెల్లెలే బాగుందంది. "ఏమీ బాగాలేదు! ఈ ప్రపంచం మొత్తం మీద కారీ అంతటి చక్కని పాపాయి లేదు" అంది లారా. "ఊహూ! ఏమీ బాగాలేదు" అంది రెండో లారా. ఈవిధంగా వాళ్ళిద్దరూ వాదులాడుకుంటుంటే మా గబగబ పరుగెత్తుకొచ్చి "లారా!" అంటూ గదిమింది. దాంతో యిద్దరూ నోర్లు మూసుకున్నారు. ఇంతలో జార్జి నగారా వాయించటం మొదలెట్టాడు. ఆ నగారాలోంచి పెద్దగా శబ్దం వచ్చింది. మధ్య మధ్య నవ్వుతూ, పోస్కా

లాడుతూ, నృత్యం చేస్తూ జార్జి పాట పాడాడు. పా పెట్టెలోంచి తన సితార్ తీసి వాయించటం ప్రారంభించాడు. పా ఒకటీ రెండూ అని లెక్కపెడుతుంటే, దంపతులంతా నృత్యం చేసేందుకు బారులు తీర్చి నిలబడ్డారు. పా 'ఇటూ అటూ' అంటూంటే జోళ్ళతో చప్పుడు చేసుకుంటూ నాట్యం మొదలెట్టారు. బూట్లతో కింద తాళం వేస్తూ, గుండ్రంగా తిరిగారు. ఒకసారి చేతితో చప్పట్లు చరిచి, ఒకసారి చేతులు పైకెత్తి తమాషాగా నృత్యం చేశారు. "ఇటూ అటూ బాగా వూగండి. ఏయ్! మీరు స్త్రీలవైపు కొద్దిగా వొంగండి" అంటూ పా కేకలు పెట్టాడు. వాళ్ళంతా పా చెప్పినట్లే చేశారు. నా గౌను తిప్పుతూ, వంగీ లేచీ నృత్యం చేస్తుంటే లారా కళ్ళప్పగించి మా కేసి చూసింది. మా అంత చక్కగా ఇంకెవరూ నాట్యం చేయలేరనుకుంది.

"ఏయ్! గొల్ల కుర్రాళ్ళా!
మీ రివాళ రాత్రి నాట్యానికి రావటం లేదా?
నాట్యానికి రావటం లేదా?
వెన్నెట్లో నిలబడి నాట్యం చెయ్యరా?"

అంటూ పా సితార్ మీద పాడాడు. అతిథులంతా వలయాకారంగా నిలబడి వంగుతూ, లేస్తూ, బూట్లతో టక టక మని తాళం వేస్తూ నాట్యం చేశారు.

వంటయింట్లో నాన్నమ్మ ఒక్కతే పానకం కలియబెడుతూ కూర్చుంది. పాటకి సరిగ్గా గరిటెతో దాన్ని కలిపింది. వంటయింటి పెరటి గుమ్మంవైపు ఒక గిన్నె నిండా శుభ్రమైన మంచు వుంది. నాన్నమ్మ అప్పుడప్పుడు గరిటెతో పానకం తీసి ఆ మంచుమీద పోసేది. కాస్సేపు ఆమెని చూసి, మళ్ళీ నాట్యం చేస్తున్న వాళ్ళకేసి తిరిగింది లారా. ఈ

మాటు "ఇరాను దేశపు చాకలి స్త్రీ" పాట ప్రారంభిం చాడు పా.

లారా యిక వుండబట్టలేక, కాళ్ళు ఆడించటం మొదలు పెట్టింది. జార్జి లారావంక చూసి నవ్వాడు. వెంటనే ఆ పిల్లని ఒక మూలగా తీసుకెళ్ళి, చేతులు పట్టుకు నాట్యం చేశాడు. పెద్దనాన్న ఎంతో మంచివాడు అనిపించింది లారాకి.

ఇంతలో అందరూ వంటయింటి గుమ్మం దగ్గిర చేరి నవ్వులు ప్రారంభించారు.

నాన్నమ్మను నాట్యం చేయమంటూ, బైటికి లాగేం దుకు ప్రయత్నించారు కొందరు. ఆమె కూడా మంచి బట్ట లేసుకుంది. పూల పూల ముదురు నీలంరంగు గౌను తొడు క్కుంది. విరగబడి నవ్వటం మూలాన ఆమె బుగ్గలు ఎఱ్ఱ బడ్డాయి. తల కొద్దిగా ఆడిస్తూ "పానకం వదిలిపెట్టి నేను రాలేను" అంటూ మళ్ళీ లోపలి కెళ్ళిపోయింది.

కాని పా "ఆర్కన్సాస్ బాటసారి" పాట వాయిం చటం మొదలు పెట్టాడు, అందరూ చప్పట్లు చరుస్తూ దానికి తాళం వేశారు. అందుకని నాన్నమ్మ వాళ్ళవైపు ఒంగి నమ స్కరించి రెండు మూడు అడుగులేసింది. నిజానికి ఆమె ఎంతో చక్కగా నాట్యం చేసింది, ఆ చప్పట్లలో పా సితార్ విని పించనేలేదు.

ఇంతలో జార్జి వున్నట్లుండి నడుంమీద చేతులు పెట్టు కుని ఒంగి నాట్యం ప్రారంభించాడు. నాన్నమ్మ అక్కడ నిలబడ్డ వారికొకరికి తన చేతిలో గరిటె అందించి పెద్దనాన్న కెదురుగా నిలబడి నాట్యం చేసింది. అది చూసి అందరూ సంతోషంతో కేకలు పెట్టారు. లారా కూడా ఉత్సాహంతో

చప్పట్లు చరిచింది. పా అంతకు ముందెన్నడూ అంతబాగా సితార్ వాయించలేదు. నాన్నమ్మ సగం కళ్లు మూసుకుంది, చెక్కిళ్ళన్నీ ఎర్రబడ్డాయి. జార్జితో సమంగా బూట్లతో టక టక నాట్యం చేస్తూనే వుంది. అందరూ ఆశ్చర్యంతో ఆ నాట్యం చూశారు. అపకుండా వాళ్ళు నాట్యం చేస్తూనే వున్నారు. కాస్సేపటికి జార్జి నుదుటిమీద చెమట తుడుచుకుని గట్టిగా వూపిరి తీసుకున్నాడు. నాన్నమ్మ సంతోషంతో అతనివంక చూసింది. "నువ్వు నాన్నమ్మని ఓడించలేవు జార్జి" అంటూ ఎవరో కేక పెట్టారు.

జార్జి అంతకుముందు వేసిన దానికంటె రెండింతలు వేగంగా అడుగులేయటం ప్రారంభించాడు. ఆమె కూడా వేగం హెచ్చించింది. అది చూసి అందరి ముఖాలు వికసించాయి, ఆడవాళ్ళంతా చప్పట్లు కొడుతూ నవ్వేశారు. మగవాళ్ళు జార్జిని ఉడికించారు. జార్జి ఆ వేగాన్ని ఆపలేవూ పట్టించుకోలేదు. కాని నవ్వటానికైనా వ్యవధి లేకుండా నాట్యం చేస్తూనే ఉన్నాడు.

పా ఆనందానికి యిక అంతేలేదు. సితార్ తీగలు ఆ నాట్యానికి అనుగుణంగా మోగుతూనే వున్నాయి. లారా గంతులేస్తూ కేకలు పెట్టింది.

నడుంమీద చేతులు పెట్టుకుని తల పైకెత్తి నవ్వుతూ నాన్నమ్మ నాట్యం ఆపనేలేదు. జార్జి నాట్యం చేస్తున్నాడే గాని మునపటికిమల్లే అతని జోళ్ళు బలంగా చప్పుడు చేయటం లేదు. ఆమె మటుకు అలసి పోలేదు. జార్జి నుదుటి మీదుగా ఒక చెమట చుక్క కారి చెక్కిలిమీద పడింది. ఉన్నట్లుండి రెండు చేతులూ పైకెత్తి, నిట్టూర్చి "నేను ఓడిపోయాను" అన్నాడు జార్జి.

అందరూ ఒక్కసారిగా పెద్ద గల్లంతు చేస్తూ కేకలు పెట్టి నాన్నమ్మని అభినందించటం మొదలు పెట్టారు.

నాన్నమ్మ మధ్య మధ్య అయాసపడుతూ నవ్వింది. ఆమె కళ్లు కూడా ఫ్రాంకళ్ళకి మల్లె సంతోషంతో మిల మిల మెరిశాయి. జార్జి కూడా చేతితో చెమట తుడుచుకుంటూ నవ్వాడు.

ఉన్నట్లుండి ఆమె నవ్వు ఆపేసి వంటింట్లోకి పరుగెత్తింది. పా సితార్ ఆపేశాడు. ఆడవాళ్ళంతా కబుర్లు ప్రారంభించారు. మగవాళ్ళు జార్జిని వేళాకోళం చేశారు. ఇంతలో నాన్నమ్మ తలుపు దగ్గిరకి వచ్చి "పానకం తయారయింది. బల్లలు సర్దండి" అన్నది. అతిథులంతా నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ వంటింట్లోకి వెళ్లి పళ్ళాలు తెచ్చుకున్నారు. వాటిని బైటికి తీసుకెళ్ళి మంచుతో నింపుకున్నారు. వంటింటి తలుపు తెరుచుకుని వుండటం వల్ల లోపలికి చల్లగాలి వీస్తోంది. అరుబైటంతా మంచుగా వుంది. ఆకాశాన నక్షత్రాలు మిణుకు మిణుకుమంటున్నాయి. లారా బుగ్గలు చల్లగా అయిపోయాయి. పిల్లలంతా పళ్ళాల్లో మంచు తీసుకుని మళ్లీ వంటింట్లో గుంపు మధ్యకి వచ్చారు. నాన్నమ్మ ఇత్తడి గిన్నెలోంచి వేడి వేడి పానకం తీసి, గరిటెతో ఒక్కొక్క పళ్ళెంలో వేసింది. అది మెల్లిగా చల్లబడి మిఠాయికి మల్లె తయారయింది. అది చల్లబడుతూనే వాళ్లు దానిని తినటం ప్రారంభించారు. గంగిరేణుచెట్టు రసం ఒంటికేమీ హాని చెయ్యదు కనుక మిఠాయి తిన గలిగినంత బాగా తిన్నారు అతిథులు. గిన్నె నిండా బోలెడంత పానకం వుంది. బైట మంచుకి యిక కొరతే లేదు. పళ్లెంలోదంతా తినేసిన తర్వాత మళ్ళీ పళ్లెంనిండా మిఠాయి నింపుకునేవారు. నాన్నమ్మ పళ్ళాల్లో పానకం పోస్తూనే వుంది.

మొహం మొత్తేంతవరకూ మిఠాయి తినటం పూర్తయాక అనపకాయలు, ఉడకబెట్టిన పంది మాంసముతో రకరకాల పిండి వంటలు తినటం ప్రారంభించారు. ఒక పొడుగాటి బల్లనిండా ఫలహారాలు పెట్టుకున్నారు. కడుపునిండా బాగా ఆ పిండివంటలు తిన్నాక మళ్ళీ నాట్యం చేయటానికి ఉపక్రమించారు. కాని నాన్నమ్మ యింకా పానకం కలియబెడుతూనే వుంది. తరుచు పానకం కొంచెంగా ఒక పళ్లెంలో పోసి కదిలించి చూసేది. తృప్తిగా లేదన్నట్లు తల అడ్డంగా తిప్పి మళ్ళీ దాన్ని గిన్నెలో పోసి కలియబెట్టేది. పక్క గదిలో నాట్యం, సంగీతం, గోల జరుగుతూనే వున్నాయి. చిట్ట చివరికి పానకం గట్టిపడడం ప్రారంభించింది. "పిల్లలూ! రండి రండి." అని కేకేసింది. డోసియా, రుబీ, మా నాట్యం ఆపి పరుగెత్తుకుంటూ వచ్చారు. పెద్ద పెద్ద పళ్ళాలు తీసుకుని నాన్నమ్మ చుట్టూ చేరారు. ఆమె వెంట వెంటనే వాటిల్లో పానకం పోశాక ఒక్కొక్క పళ్ళెన్నే చల్లారబెట్టారు. "ఊ! ఇక పిల్లలకి పళ్ళాలు తెండి" అన్నది నాన్నమ్మ. పిల్లలకి విరిగిపోయిన చిన్న చిన్న కప్పులూ, పళ్లాలూ మిగిలాయి. వాటిల్లో పానకం పోస్తుంటే, ఆమె వంక ఆతురతతో చూశారు పిల్లలంతా. బహుశః పానకం తమకి మిగలదేమో అనిపించింది పిల్లలకి. అలా చాలక పోయేట్లయితే వాళ్ళల్లో కొందరయినా మర్యాదగా వూరుకో వలసి వుంటుంది. గిన్నెలోని పానకం అందరికీ సరిగ్గా సరిపోయింది. ఆఖరి పళ్లెం నిండాక గిన్నె అడుగున ఒక్క చుక్క పానకం కూడా మిగలలేదు. ఆ తర్వాత మళ్ళీ సితార్ వాయిద్యం, నాట్యం మొదలు పెట్టారు. ఇద్దరు లారాలు కాస్సేపు గదిలో ఓ మూలగా నిలబడీ, కాస్సేపు నేలమీద కూర్చునీ నాట్యం చూశారు. ఎంతసేపు చూసినా నాట్యం విసుగనిపించలేదు లారాకి. బూట్లు టక టక శబ్దం చేస్తున్నాయి. గౌన్లు గాలికి అటూ ఇటూ ఎగురుతున్నాయి. సితార్ పాట వాయిస్తూనే వుంది.

లారా కళ్లు తెరిచి చూసేటప్పటికి తను నాన్నమ్మ మంచంమీద పడుకునుంది. తెల తెలవారుతూంది. మంచం మీద ఓ పక్కగా మా, నాన్నమ్మ, చిన్ని చెల్లాయి కారీ పడుకున్నారు. పొయి పక్కన కిందగా పా, తాతయ్య దుప్పట్లు కప్పుకుని పడుకున్నారు. మేరీ ఆ చుట్టుపక్క లెక్కడా లేదు. డోసియా, రూబీ అత్తయ్యలతో వారి మంచంమీద పడుకుంది. ఆ తర్వాత ఒకొక్కరే మెల్లి దిగా నిద్ర లేచారు. పానకం, కేకులు ఫలహారం పుచ్చు కున్నారు. ఇంతలో పా గుఱ్ఱాలనీ, బండినీ గుమ్మం ముందుకు తీసుకొచ్చాడు. పా, సాయంతో, మా కారీని ఎత్తుకొచ్చి బండీలో కూర్చుంది. తాతయ్య మేరీని, పెద్దనాన్న లారాని లేపుకొచ్చి బండీలో కూర్చోబెట్టారు. పా వాళ్ళకి దుప్పట్లు కప్పాడు. తాతయ్యా, నాన్నమ్మా గుమ్మం దగ్గరకొచ్చి "టా! టా!" చెప్పారు. బండీ చిట్టడవిలోంచి యింటిదారి పట్టింది.

వాతావరణమంతా నునువెచ్చగా వుంది. గుఱ్ఱాలు టక టక వెళుతుంటే, వాటి డెక్కలనుంచి మంచు ముద్దలు అటూ ఇటూ చిందాయి. బండీ వేగంగా పోతుంటే, దాని వెనకాల గుఱ్ఱాల అడుగు జాడలు కనిపించాయి లారాకి. మంచులో అవి బాగా లోతుగా దిగబడ్డాయి. "ఇవాళిటితో తీపి మంచు పూర్తయి పోతుంది" అన్నాడు పా.

# 7

ఆ తర్వాత వసంతకాలం ఆరంభమయింది. ఇంటి చుట్టూ కంచెనానుకుని చెట్లు గుబురు గుబురుగా పెరిగాయి. వాటిమీద కూర్చుని, పక్షులు కిల కల గానంచేశాయి. నేలంతా పచ్చని గడ్డితో నిండిపోయింది. అడవినిండా రకరకాల పూలు విరగబూశాయి. ఎక్కడచూసినా, పూల గుత్తులే కనుపించేవి.

బాగా వేసంగి రోజులు వచ్చేసరికి, లారా, మేరీ జోళ్ళు లేకుండా బైటికెళ్ళి ఆడుకుంటామని బ్రతిమాలుకున్నారు పాని. మొదట్లో కాస్త దూరం వెళ్ళటానికి మాత్రమే వాళ్ళకి అనుమతి చిక్కింది. తర్వాత క్రమంగా అడవి అంతా పరుగెత్తుతూ ఆడుకోవటం ప్రారంభించారు. జోళ్ళకి మెరుగుపెట్టి, వుత్తి కాళ్ళతోనే ఆడుకున్నారు. రోజూ రాత్రి పడుకునే ముందు కాళ్ళు కడుక్కునేవారు.

ఎండలో తిరగటం మూలాన మా కాళ్ళు, పాదాలు కూడా వాళ్ళ ముఖాలకి మల్లెనే గోధుమరంగుగా మారాయి.

వాళ్ళ ఇంటిముందు రెండు పెద్ద సిందూరపు చెట్లు వుండేవి. వాటికింద లారా, మేరీ బొమ్మరిళ్లు కట్టుకుని ఆడుకునేవారు. లారా ఒక చెట్టుకిందా, మేరీ ఒక చెట్టు కిందా విడివిడిగా యిళ్ళు కట్టుకునేవారు. కింద పచ్చని గడ్డి నేలగానూ, పైనపచ్చని ఆకులు యింటికప్పుగానూ, ఆయిళ్లని అందంగా కట్టేవారు. పైన యింటి ఆకుల మధ్యనుంచి నీలాకాశం కనుపించేది వారికి.

లారా చెట్టు కొమ్మకి ఒక ఉయ్యాల కట్టాడు పా. లారా చెట్టుకి కట్టాడు కాబట్టి, ఆ ఉయ్యాల లారా సొంతం అయింది. కాని అప్పుడప్పుడూ మేరీని కూడా వూగనిచ్చేది లారా. మేరీ ఒక చిల్లిపడిన పళ్లెంతో ఆడు కునేది. లారా ఒక పక్కంతా పగిలివున్న పెద్ద కప్పుతో ఆడుకునేది. లారా బొమ్మ చార్లెటీ, నెట్టీ, పా తయారు చేసిన రెండు కొయ్యబొమ్మలూ, ఆ బొమ్మరిళ్ళల్లో తెచ్చి పెట్టుకున్నారు. ప్రతిరోజూ ఆకులతో వాళ్ళు తమ బొమ్మలకి టోపీలు చేసేవారు. చిన్న రాయిని బల్లగా పెట్టి, చిగురాకు లతో కప్పులూ, పళ్ళాలూ చేసి దానిమీద పెట్టేవారు.

వాళ్ళ ఆవులు పుకీనీ, రోజీనీ, మేతకోసం అడవిలో స్వేచ్ఛగా వదిలేశారు. గాదెలో రెండు చిన్న దూడలున్నాయి. పందులుండే గుడిసెలో ఎనిమిది చిన్న పందిపిల్లలున్నాయి. క్రితం సంవత్సరం చెట్లు కొట్టేసిన చోటంతా, పొలం దున్నటం ప్రారంభించాడు పా. ఒకరోజు రాత్రి పొలం నుంచి రాగానే "ఇవాళ నేను ఏం చూశానో తెలుసా?" అనడిగాడు. మా అదేమిటో ఊహించి చెప్పలేకపోయ్యింది. "సరే! అయితే చెబుతా వినండి. ఇవాళ పొద్దున్న దున్నుతో

ఎందుకో తల ఎత్తి చూశాను. దూరాన ఒక జింక కనిపించింది. దానికూడా ఏముందో మీరు అసలు ఊహించలేరు." అని ఆగాడు పా. ఒక్క క్షణంలో అదేమిటో ఊహించి, "చిన్న జింకపిల్ల" అని చప్పట్లు చరిచారు లారా, మేరీ. "అవును. జింక కూడా ఒక చిన్న పిల్ల వుంది. పెద్ద నల్లని కళ్ళు, లేత రంగు, ఆ జింకపిల్ల ఎంతో ముద్దుగా వుంది. చిన్న చిన్న పాదాలు, సన్నటి కాళ్ళు, చాలా అందంగా వుంది. ఆ నల్లని జాలిగొలిపే కళ్లతో, నా కేసి నిర్భయంగా చూసింది. "జింకపిల్లని నువ్వు తుపాకితో చంపవుకదు పా?" అనడిగింది లారా. "అబ్బే! ఎన్నటికీ చంపను. పెద్దజింకలని కూడా యిప్పుడు చంపను. అడవిలోని క్రూరమృగాలన్నీ బాగా ఎదిగేంతవరకూ, నేను వేటకి పోదలచుకోలేదు. బహుశః ఎండాకాలం పూర్తయే వరకూ మాంసం లేకుండానే వుండవలసి వస్తుంది." అన్నాడు పా.

పొలంలో పంట ప్రారంభమయాక వాళ్లంతా పట్నానికి వెళ్ళిరావాలన్నాడు పా. కాస్త పెద్దవాళ్ళయారు కాబట్టి లారా, మేరీ కూడా వాళ్ల వెంటరావచ్చు అన్నాడు. అది విని లారా, మేరీ సంతోషంతో ఉక్కిరి బిక్కిరయిపోయారు. మర్నాడు బొమ్మరిల్లు పట్నానికి వెళ్ళే ఆట ఆడుకున్నారు. కాని వాళ్ళకి పట్నమంటే బొత్తిగా తెలియకపోవటం వల్ల, ఆ ఆట చాతకాలేదు. పట్నంలో ఒక దుకాణముంటుందని తెలుసు వాళ్లకి. కాని ఆ దుకాణాన్ని వాళ్ళు ఎన్నడూ చూడలేదు. ప్రతిరోజూ ఆటల్లో చార్లెటీ, నెల్లీ బొమ్మలు, వాళ్లని పట్నం తీసుకువెళ్ళమని అడిగేవి. కాని లారా, మేరీ, "వద్దమ్మా! ఈ సంవత్సరం వెళ్లటానికి వీలుపడదు. మీరు బుద్ధిగా వుండే పక్షంలో, బహుశః పైసంవత్సరం వెళదాము" అనేవారు. పెద్దవాళ్ల మాటలు విని, అలా రకరకాల ఊహాలు నిర్మించుకుంటూ ఆడుకునేవారు. ఇంతలో ఓ రాత్రి పా, "రేపు మనం పట్నంపోదాం"

అన్నాడు. ఆ వేళ బుధవారమే అయినా, మా లారాకీ, మేరీకీ ఆ రాత్రే నీళ్లుపోసి తలదువ్వింది. జుత్తుని పాయలుగా తీసి, వుండలుగాపైకి చుట్టి గట్టిగా దారం కట్టింది. అవి తెల్లారేప్పటికి చక్కగా ఉంగరాలుగా తిరుగుతాయి.

ఆ సంతోషంలో వెంటనే నిద్దరే పట్టలేదు లారాకీ, మేరీకీ. ఎప్పటి చొప్పున మా సంచీ కుడుతూ కూర్చోలేదు. హడావుడిగా అటూ ఇటూ తిరుగుతూ సామానులన్నీ సర్ది, ఉదయం ఫలహారాలు చేయటానికి ఉపక్రమించింది.

వేసంగిలో పొద్దు ఎక్కువగా వుండేది. మర్నాడు పొద్దున్న వాళ్లు ఫలహారం ముగించేలోపు మా లాంతరు ఆర్పేసింది, ఫలహారం తొందరగా ముగించమని పిల్లల్ని తొందర చేసింది. తర్వాత వంటగిన్నెలన్నీ శుభ్రం చేసింది. తర్వాత అందరూ బట్టలు మార్చుకున్నారు. మా లారా చొక్కాకి వెనక బొత్తాములు పెట్టింది. తర్వాత వాళ్ళిద్దరికీ తలలు దువ్వింది. చిక్కుపడ్డ జుత్తుని బాగా దువ్వి, ఉంగరాలుగా తిప్పి, బుజంమీద వేళ్ళాడేసింది. మా గబగబ గట్టిగా దువ్వుతుంటే, బాధ పుట్టింది. మేరీ జుత్తు బంగారు రంగులో తళతళ లాడుతుండేది. లారా జుత్తుమటుకు గోధుమ రంగులో వుండేది. తల దువ్వాక, ఎండ తగలకుండా తలకి టోపీ పెట్టుకుని, మెడకి బంగారు పిన్ను గుచ్చుకుంది. పా బండీ తోలటానికి ఉపక్రమించాడు.

గుర్రాలకి బాగా నీళ్లు పోసి కడిగి, బండీ లోపలంతా శుభ్రంగా ఊడ్చి, కూర్చునే దానిమీద తెల్లని దుప్పటి కప్పాడు పా. క్యారీ నెత్తుకుని మా, పా పక్కనే కూర్చుంది. బండీ వెనకాతల కొయ్యపలక మీద లారా, మేరీ కూర్చున్నారు.

వసంతఋతువులో చిట్టడవిలోంచి ప్రయాణం చేయటం సరదాగా వుండేది. ఆ రోజు వాళ్ళు బండీలో వెళుతుంటే, వెచ్చగా ఎంతో బాగుంది. పక్కన చెట్లనుంచి చల్లగా, సువాసన గాలులు వీస్తున్నాయి. పా గుర్రాలని తోలుతూ నెమ్మదిగా ఈలవేశాడు అమ్మ చిన్నగా నవ్వింది. కారీ చప్పట్లు కొడుతూ మా వొళ్ళో ఎగిరెగిరి దుమికింది.

ఉన్నట్లుండి రోడ్డుకి అడ్డంగా ఉడతలు పరుగెత్తుకొచ్చేవి. కాస్సేపు నేలవాసన చూసి, మళ్ళా వెంటనే తోక ఎగరేస్తూ పారిపోయేవి. రెండు మూడు సార్లు చెట్ల చాటునుంచి జింకపిల్లలు తమకేసి చూస్తుండటం కనుపించింది లారాకీ, మేరీకీ. అడవినుంచి పట్నానికి ఏడు మైళ్ళ దూరముంది. లేక్ పెపినే అంచున వున్న ఆ పట్నాన్ని పెపిన్ అనేవారు.

చాలాసేపు ప్రయాణం చేశాక, చెట్లగుండా వాళ్లకి నీళ్ళు కనుపించాయి. గతుకుల దారిపోయి మెత్తని యిసక రోడ్డు వచ్చింది. బండీ చక్రాలు ఆ యిసుకలో లోతుగా దిగబడిపోవటం వల్ల గుర్రాలు బండీని లాగలేక అలసిపోసాగాయి. పా తరుచు బండీని ఆపి వాటికి విశ్రాంతి కల్పిస్తూ వచ్చాడు.

ఇంతలో బండీ పూర్తిగా అడవిని దాటి పట్నంలో ప్రవేశించింది. ఆ కాశానికి మల్లె నీలిరంగులో పెద్ద సరస్సు కనుపించింది లారాకి, కనుచూపు మేరవరకూ నీళ్ళు తప్ప మరేమీ కన్పించ లేదు. ఆ సరస్సు ప్రపంచ మంతటా వ్యాపించిందా అనేంత పెద్దదిగా వుంది. నీళ్ళ అంచున ఆకాశమూ, నీళ్ళూ కలిసిపోయినట్లున్నాయి. ఆ కలిసిన చోట యించుమించు ముదురురంగులో ఒక నీలిరంగు గీత వుంది. పైనంతా విశాలంగా ఆకాశం కనపడుతోంది. అసలు ఆకా

శం అంత పెద్దదిగా వుంటుందని లారాకి తెలియ నే
లేదు. ఆ ఆకాశం, నీళ్ళు, చుట్టూతా, చూసేటప్పటికి లారా
కెందుకో భయమేసింది. తను ఒంటరిగా లేననీ, కూడా మా,
పా వున్నారనే విషయం జ్ఞాపకం రాగానే కాస్త ధైర్యం
చిక్కింది. ఇంతలో చుర చుర మంటూ ఎండ కాయటం
ప్రారంభించింది. మిట్ట మధ్యాహ్న మయింది. అంత పెద్ద
ఆకాశం చూసేసరికి, అడవి కూడా ఎంతో చిన్నదిగా కను
పించింది లారాకి. పా బండీ ఆపి, వెనక్కి తిరిగాడు.
కంచీతో ముందు చూపిస్తూ, "ఒచ్చేశాము పిల్లలూ! అదిగో!
అదే పెపిన్ పట్నం" అన్నాడు. లారా పలకమీద లేచి
నిలబడి పట్నం చూసింది. పా పడిపోకుండా లారా
చెయ్యి పట్టుకున్నాడు. ఆ వూరు చూడగానే లారా ఒక్క
క్షణం ఆశ్చర్యంతో నిలబడిపోయింది. కథలో యాంకీ
డూడుల్ కూడా బోలెడన్ని యిళ్ళు వుండడం వల్ల, వూరు
చూడలేకపోయాడని లారాకి తెలుసు. సరస్సు అంచున
ఒక పెద్ద బంగళా వుంది. దానికి ఇవతల పక్కగా పా
చెప్పిన దుకాణం వుంది. బూడిదరంగు పలకలతో చేశారు
ఆ దుకాణాన్ని. దాని చుట్టూతా ఇసక వుంది.

దుకాణం వెనకాల పెద్ద ఖాళీస్థలం వుంది. చెట్ల
మధ్య లెక్కపెట్ట లేనన్ని యిళ్ళువున్నాయి. ఆ యిళ్ళు
దుంగలతో కట్టి వున్నాయి. పక్క పక్కనే వున్న అన్నేసి
యిళ్ళు చూడగానే లారా ఆశ్చర్యపోయింది. అసలు అన్ని
యిళ్ళని లారా ఊహించనైనా ఊహించలేదు. నిజానికి
అవి దుకాణం కంటె చిన్నవిగానే వున్నాయి. అందులో
ఒకటి అప్పుడే కొట్టిన కొయ్య పలకలతో చేసివుంది. ఆ ఇళ్ల
నిండా మనుష్యులున్నారు. ఇంటి పొగ గొట్టాల్లోంచి పొగ
వస్తూంది. ఆ వేళ సోమవారమే అయినా ఒకావిడ యింటి
వెనక చెట్లమీద బట్టలుతికి ఆరేసింది. దుకాణం వెనక
ఖాళీ స్థలంలో చిన్న చిన్న అమ్మాయిలూ, అబ్బాయిలూ

ఆర్చుకుంటున్నారు. ఆ ఎండలో ఒక చెట్టు మీంచి ఒక చెట్టు మీదికి గంతులేస్తూ అరుస్తున్నారు. "ఇదే పెపిన్" అన్నాడు పా. లారా తల ఆడించింది. ఎంతసేపూ చూసినా తనివి తీరలేదు లారాకి. కాసేపటికి కిందకూర్చుంది. బండీ బయలుదేరింది.

సరస్సు ఒడ్డున బండీని ఆపాడు. పా గుర్రాలని విప్పి, బండీకి రెండుపక్కలా కట్టాడు. తర్వాత చెరొక చేత్తో లారానీ, మేరీనీ పట్టుకుని ముందుకు నడిచాడు. కారీ నెత్తుకుని మా జెన కాతల నడిచింది. ఇసుకలో మెల్లిగా నడుచుకుంటూ దుకాణంవైపు నడిచారు. ఇసుకలో కాలు లోతుగా దిగబడి, లారా బూడ్సుల్లోంచి వేడిగా యిసుక పైకి చిమ్మింది. దుకాణంముందు వెడల్పాటి వరండా ఉంది. ఇసుకలోంచి ఆ వరండాకి మెట్లు ఉన్నాయి. మెట్లెక్కుతుంటే లారా గుండె దడదడ కొట్టుకుంది. మనిషంతా వణకటం ప్రారంభించింది. ఆ దుకాణంలోనే పా తోళ్లు అమ్మేవాడు. లోపలికి వెళ్ళగానే, దుకాణాదారుడు, గల్లాపెట్టె వెనకనుంచి మా నీ, పా నీ పలకరించాడు. తర్వాత లారా, మేరీ మర్యాదగా అతనితో కరస్పర్శ చేశారు. "మీ అమ్మాయి చాలా బాగుందే" అంటూ దుకాణదారుడు మేరీని చూపించాడు. మేరీ బంగారురంగు ఉంగరాల జుత్తు అతనికెంతో నచ్చింది. కాని లారాని గురించి కానీ, లారా ఉంగరాలని గురించిగానీ అతనేమీ అనలేదు. గోధుమరంగులో లారా జుత్తు ఏమంత అందంగాలేదు.

దుకాణంనిండా రకరకాల వస్తువులున్నాయి. ఓ పక్క అలమారులో నీలం, ఎఱుపు, పచ్చ రంగుల్లో అనేక రకాల పూల గుడ్డలున్నాయి. కింద బుట్టల్లో బొమ్మలూ, తినుబండారాలు, మిఠాయిలు ఉన్నాయి. దుకాణంమధ్య ఒక గొయ్యికి సుత్తి, పాఱ, రంపం, గొడ్డలి, వేట కత్తులు వేళ్లాడ

కట్టి ఉన్నాయి. అంతే కాదు; ఓ పక్కగా పెద్దవీ; చిన్నవీ అన్నిరకాల బోట్లు ఉన్నాయి. ఆ వస్తువులు చూడటానికి కొన్ని వారాలు కాదుకదా కొన్ని నెలలు పడుతుందనిపించింది లారాకి, అసలు ప్రపంచంలో అన్ని వస్తువులున్నాయని తెలియదు లారాకి.

మా, పా వస్తువులు బేరం చేయటం మొదలుపెట్టారు. మా ముందు తానులు తానులుగా గుడ్డ పోసి, బేరం కట్టమన్నాడు దుకాణాదారుడు. లారా, మేరీ ఆ గుడ్డలకేసి చూడవచ్చు గాని ముట్టుకు చూసేందుకు వీలులేదు. ఆ రంగుల గుడ్డలన్నీ ఒకదానికంటె ఒకటి అందంగా ఉన్నట్లనిపించింది లారాకి. అన్నేసి గుడ్డలుంటే మా ఎలా ఏరుకోగలదా అనిపించింది ఆ చిన్నారికి. పాకి చొక్కాలకని రెండు గళ్ల గుడ్డలు, బనీనుకి ఒక గోధుమరంగు గుడ్డ, లాగూలకి తెల్లగుడ్డ తీసుకుంది మా. మా కోసం ఓ కొత్త గౌనుగుడ్డ తీయించాడు పా. "ఇవన్నీ నాకు ఇప్పుడవసరం లేదు" అంటూ వారించబోయింది మా. ఆ గుడ్డ తీసుకోమనీ, లేకపోతే పసుపు చుక్కలున్న ఎర్రగుడ్డ తీసుకుంటాననీ అన్నాడు పా నవ్వుతూ. ఆ మాటకి అమ్మ చెక్కిళ్లు ఎర్రబడ్డాయి. ముఖం పక్కకితిప్పి చిన్నగా నవ్వుకుంది. గులాబీపూలు, ఆకులూ ఉన్న చక్కటి పూల గౌనుగుడ్డ ఏరుకుంది.

తర్వాత చుట్ట కాల్చుకునేందుకు కాస్త పొగాకు కొనుక్కున్నాడు పా. మా ఒక పౌను టీ, నిలవ ఉంచేందుకు ఒక పొట్లం చక్కెర తీసుకుంది. గంగిరేణిచెట్టు చక్కరలా కాకుండా ఆ చక్కెర లేత గోధుమరంగులో ఉంది. ఇంటికి అతిథులు వచ్చినప్పుడు ఉపయోగించేందుకు ఆ చక్కెరని నిలవ ఉంచేది మా.

వస్తువులు కొనటం అయిపోయాక, దుకాణాదారుడు మేరీకీ, లారాకీ చెరి ఒక మిఠాయి యిచ్చాడు. ఆ మిఠాయి

చూడగానే వాళ్ల సంతోషానికి అంతులేదు. కళ్ళప్పగించి దానికేసి చూస్తూ అలాగే నిల్చుండిపోయారు. కాస్సేపటికి మేరీకి "థ్యాంక్స్" చెప్పాలనే విషయంగుర్తుకు వచ్చింది. లారాకి నోట మాటరాలేదు. ఏం చెబుతుందా అని అందరూ లారాకేసి చూశారు. కాని లారా నోట్లోంచి ఒక్కమాట పెగిలి రాలేదు. "నువ్వు చెప్పు లారా!" అని మా అడిగేంత వరకూ లారా నోరు మెదపలేదు. ఆ తర్వాత ఒక్క గుటక వేసి, "థ్యాంక్యూ" అని గొణిగింది.

ఆ తర్వాత వాళ్లు దుకాణంవదిలి వెళ్ళిపోయారు. ఆ ఒక్కొక్క మిఠాయివుండ, తెల్లగా పల్చగా గుండ్రని ఆకారంలో ఉంది. మేరీ మిఠాయిమీద ఎర్రని అక్షరాలతో,

"గులాబీలు ఎర్రగా ఉన్నాయి,
చక్కెర తియ్యగా ఉంది,
నువ్వూ తియ్యని పిల్లవి"

అని రాసి ఉంది. లారా మిఠాయిమీద,

"చక్కని పిల్లకిమి ఠాయిలు"

అని రాసి ఉంది. ఇద్దరి మిఠాయిలు దాదాపు ఒకే మాదిరి ఉన్నాయి. లారా మిఠాయిమీద అక్షరాలు మటుకు కాస్త పెద్దవిగా రాసి ఉన్నాయి.

దుకాణంనుంచి నడుచుకుంటూ వాళ్లు సరస్సు తీరానికి వెళ్ళారు. పా గుర్రాలకి కాస్త మేత వేశాడు. మా ఫలహారం మూట విప్పింది. బండీదగ్గిర వెచ్చని ఇసుకలో కూర్చుని, రొట్టె, వెన్న, కోడిగుడ్లు తిన్నారు. పెపిన్ సరస్సు అలలు వాళ్ళ కాళ్ళ దగ్గిరవరకూ వచ్చి, మళ్ళీ వెనక్కి పోతు

న్నాయి. భోజనాలయాక, పా స్నేహితులతో కాస్సేపు కబుర్లు చెప్పేందుకు మళ్ళీ దుకాణంవైపు వెళ్ళాడు. మా కారీని ఎత్తుకుని, జోకొడుతూ నిద్రపుచ్చింది.

కాని లారా, మేరీలు మటుకు నీటి ఒడ్డున పరుగెడుతూ అలలతో సహా ముందుకి వెనక్కి పొర్లుతున్న గులకరాళ్లని ఏరుకోసాగారు. చిట్టడివిలో అటువంటి రాళ్ళు దొరికేవి కావు. ఒక్కొక్క రాయినే చూసి మురిసిపోతూ, లారా తన జేబు నిండా గులకరాళ్లు నింపుకుంది. ఇంతలో ఇంటికి వెళ్లేందుకు వేళయిందని పా కేక వేశాడు. గుర్రాలు బండీకి కట్టి సిద్ధంగా ఉన్నాయి. లారా, మేరీ బండీ దగ్గరకి పరుగెత్తారు. జేబు నిండా అంత చక్కని గులకరాళ్లు నింపుకుని, ఇసుకలో పరుగెడుతుంటే, లారా సంతోషంతో ఉక్కిరిబిక్కిరయింది. కాని పా ఆ చిన్నారిని ఎత్తుకుని బండీలో కూర్చోబెడుతుంటే ఒక సంఘటన జరిగింది. గులకరాళ్లు బరువుకి, లారా జేబు చిరిగి, రాళ్ళన్నీ కిందికి దొర్లాయి. మంచి గౌను చింపుకున్నందుకు లారా ఏడుపు మొదలెట్టింది. మా కారీని పా చేతికందించి, గబగబ వచ్చి చిరుగు చూసింది. "ఏడవకు లారా! నేను మళ్ళీ అది కుట్టగలను" అంటూ ఓదార్చింది మా. ఆ తర్వాత గౌనుగానీ, జేబుగానీ ఏ మాత్రం చిరగలేదని చూపించిందిలారాకి. ఆ జేబు గౌను లోపలగా, చిన్నగా ముడివేసి వుంది అంతే! మా తను ఎంతో సులువుగా మళ్ళీ దానిని కుట్టేయగలనంది. "లారా! గులకరాళ్లని ఏరి తీసుకో. ఇంకో మాటు ఎప్పుడూ అత్రంగా అన్నేసి గులక రాళ్ళను జేబులో వేసుకోక" అంది. లారా ఆ గులకరాళ్లని ఏరుకుని, జేబులో వేసుకుని, ఆ చిరిగిన జేబు ఒళ్ళో పెట్టుకు కూర్చుంది. ఆతురతతో మోయలేనన్ని రాళ్ళు ఏరుకొచ్చినందుకు పా లారాని వేళాకోళం చేశాడు. లారా అదేమీ పట్టించుకోకుండా, మౌనంగా కూర్చుంది.

"మేరీకి ఎప్పుడూ అటువంటి పరాభవం జరగలేదు. మేరీ ఒక్క సారి కూడా అల్లరిగా ప్రవర్తించలేదు. బట్టలు పాడు చేసుకోలేదు. మేరీకి జుత్తు బంగారు రంగులో ఉంగరాలు తిరిగి వుంది. మేరీ మిఠాయి మీద ఒక పద్యం రాసివుంది. నలిగిపోని శుభ్రమైన బట్ట లేసుకుని, ఎంతో నెమ్మదిగా, సౌమ్యంగా కూర్చునివుంది మేరీ" ఈ విధంగా ఆలోచించుకునే టప్పటికి, లారా మనసు కెంతో బాధ కలిగింది.

కాని ఆ రోజు లారా ఎంతో సంతోషంగా వుంది. తన జీవితంలో కల్లా ఆ రోజే ఎంతో హాయి అయిన రోజని పించింది లారాకి. అందమైన సరస్సు గురించీ, తను చూసిన పట్నాన్ని గురించీ, దుకాణం గురించీ లారా ఆలోచించ సాగింది. ఇంటికి వచ్చేంతవరకూ గులకరాళ్లని ఒళ్ళోనే దాచుకుంది మిఠాయి వుండల్ని జాగ్రత్తగా రుమాలులో చుట్టి, చేతిలో పట్టుకుంది. వెంటనే తినేయకుండా. ఆ మిఠాయిని దాచుకుంది. గతుకుల రోడ్డుమీదుగా బండీప్రయాణం సాగించింది. కాస్సేపటికి సూర్యుడు అస్తమించి, చిట్టడవి అంతా చీకటి మయమైంది. కాని అవి వెన్నెలరోజులు కావటం మూలాన, కొద్ది సేపట్లోనే చంద్రోదయమైంది. ఎల్లాగయితే నేం, పా తుపాకీ పట్టుకురావటం వల్ల, వాళ్ళు సురక్షితంగా యిల్లు చేరారు. చెట్ల ఆకులగుండా రోడ్డుమీద వెన్నెల పడుతోంది. బండీ గణగణ శబ్దం చేసుకుంటూ యింటిముందు ఆగింది. లారా మేరీ బాగా అలసిపోయారు, మా మౌనంగా కూర్చుంది. మా ఒళ్ళో కారీ నిద్రపోతోంది. పా మటుకు నెమ్మదిగా ఇలా పాడాడు.

"అప్పుడప్పుడూ వేడుకలు చూసేందుకూ,
భవనాలలో తిరిగేందుకు వెళ్ళవచ్చు,
"కానీ యిల్లు అంత స్వర్గసీమ యింకొకటి లేదు."

# 8

వేసంగి వచ్చింది. ఇంటికి తరుచు అతిథులు వచ్చేవారు. హెన్రీ లేక జార్జి లేక తాతయ్య తరుచు పా కోసం వచ్చేవారు. మా గుమ్మం దగ్గిరికి వచ్చి, కుశల ప్రశ్నలడిగి, పా పొలంకి వెళ్లాడని చెప్పేది. తర్వాత వంటింట్లోకి వెళ్ళి, మరికొంత అన్నం వండేది. భోజనాలవటానికి చాలా ఆలస్యమయేది. భోజనాలయాక మా, పా వచ్చిన అతిథితో కాస్సే పుఖబుర్లు చెబుతూ కూర్చునేవారు. అప్పుడప్పుడు లారా, మేరీ కలిసి రోడ్డు దాటి, కొండదిగి, పీటర్ సన్ యింటికి వెళ్ళేవారు. పీటర్ సన్ సతి ఒక స్వీడిష్ దేశస్థురాలు. కొత్తగా చిట్టడవిలో కాపురం పెట్టింది. వాళ్ల యిల్లు ఎంతో శుభ్రంగా, అందంగా వుండేది. పీటర్ సన్ కి పిల్లలు లేరు. అందుకని తను స్వీడన్ నుంచి తెచ్చిన లేసులు, అల్లికలు, అందమైన కుట్లు, లారాకీ మేరీకీ చూపించేది. పీటర్ సన్ వాళ్ళతో స్వీడిష్ భాషలో మాట్లాడేది. వాళ్లు

మళ్ళీ ఆమెతో ఇంగ్లీషులో మాట్లాడేవారు. అట్లా మాట్లాడినా వాళ్ళకి ఒకరి భాష ఒకరికి అర్థమయేది. ఇంటికెళ్ళిపోయే టప్పుడు ఇద్దరికీ చెరివో క మిఠాయి యిచ్చేది. అవి చప్పరిస్తూ వాళ్లు యింటివైపు నడిచేవారు. సగం మిఠాయిముటుకు తిని, తతిమ్మా సగం కారీ కి యిచ్చేవారు. ఇద్దరి మిఠాయి ముక్కలు కలిపి, మొత్తం కారీకి ఒక మిఠాయి దక్కేది. నిజానికి అందులో న్యాయం లేదు. వాళ్ళిద్దరి ఊహ ఏమంటే, యిద్దరూ సమంగా కారీతో మిఠాయి పంచుకోవాలని. కారీకి ఎక్కువ దక్కకుండా చెయటానికి ఒకవేళ వాళ్ళిద్దరిలో ఎవరైనా మిఠాయి మొత్తం తినేసినా, అందులోనూ సబబు లేదు. అందుకని, ఆలోచించి ఆలోచించీ చివరికి ఏమీపాలు పోక వాళ్ళు ఆ ఒప్పందానికి వచ్చారు. కాని అందులో న్యాయంలేదని వాళ్ల మనసు పీకుతూనే వుండేది.

ఒక్కొక్కప్పుడు యిరుగుపొరుగు వాళ్లు వాళ్ళ యింటి కొస్తున్నామని కబురంపేవారు. మా అ రోజున నిలవచేసిన చక్కెర పొట్లాలు విప్పేది. ఎన్నో పిండివంటలు చేసేది. పొద్దున్నే బండీలో అతిధులు వచ్చేవారు. లారా, మేరీలతో ఆడుకునేందుకు కొత్త కొత్త పిల్లలు వచ్చేవారు.

హ్యూలెట్, అతని భార్య వీళ్ళింటికి వచ్చినప్పుడు, పిల్లలుకూడా వచ్చేవారు. అందులో ఈవ అనే అమ్మాయి బాగుండేది. ఆ పిల్ల కళ్ళు నల్లగా వుండేవి. జుత్తు వుంగ రాలు తిరిగి వుండేది. బట్టలు నలిగిపోకుండా జాగ్రత్తగా ఆడుకునేది. మేరీకి ఆ పిల్లంటే చాలా యిష్టం. కాని లారాకి క్లారెన్సుతో ఆడుకోవటమంటనే ఎక్కువ యిష్టం. క్లారెన్సు జుత్తు ఎర్రగా, రేగి వుండేది. ఎప్పుడూ పకపక నవ్వుతుండేవాడు. అతని బట్టలు కూడా శుభ్రంగా వుండేవి. ముందంతా బొత్తాములున్న నీలం కోటు, కాళ్లకి బూట్సు తొడుక్కునేవాడు. బూట్సు కొసన రాగి తళ తళ లాడు

తుండేది. ఆ బూట్సు చూపినప్పుడు లారా తను అబ్బాయి అయితే ఎంత బాగుణ్ణు అనుకునేది. చిన్న చిన్న అమ్మాయిలు అలాంటి బూట్సులు తొడుక్కునేవారు కాదు. లారా, క్లారెన్సు గట్టిగా అరుస్తూ, పరుగులుతీసి, చెట్లు ఎక్కి, ఆడుకునేవారు. మేరీ, ఈవా మటుకు నెమ్మదిగా నడుస్తూ, కబుర్లు చెప్పుకునేవారు. హ్యూలెట్ భార్య ఒక పుస్తకం పట్టుకొచ్చింది. మా, ఆవిడా కలసి ఆ పుస్తకం చూసేవారు. పా, హ్యూలెట్, చుట్టలు కాలుస్తూ, పొలంలో తిరిగేవారు.

ఓ సారి వాళ్లింటికి లోటీ వచ్చింది. ఆ రోజు పొద్దున్నే మా లారా జుత్తుని బాగా దువ్వి వుంగరా లుంగారులుగా తిప్పింది. మా తల దువ్వుతున్నంత సేపూ లారా నిలబడే వుంది. మేరీ అప్పటికే తయారయిపోయింది. ఇస్త్రీ చేసిన నీలం గౌను, వేసుకుని మేరీ కుర్చీలో సిద్ధంగా కూర్చుని వుంది. లారాకి తన ఎర్ర గౌను ఎంతో బాగుందనిపించింది. కాని మా గట్టిగా లాగి తల దువ్వుతోంది. లారా జుత్తు బంగారు రంగులో లేదు, అందరూ మేరీ జుత్తునే చూసి మెచ్చుకునేవారు. చిట్టచివరకి మా, "అబ్బ! నీ జుత్తు అందంగా వుంగరాలు తిప్పాను. లోటీని కలుసుకోండి. ఇద్దరిలో ఎవరి జుత్తు బాగుందో అడగండి" అన్నది.

వాళ్ళిద్దరూ గుమ్మం వైపు పరుగెత్తారు. అప్పటికే లోటీ గేటువరకూ వచ్చేసింది. లోటీ పెద్దపిల్ల. మేరీకంటె పొడుగ్గావుంది. గులాబీ రంగు దుస్తులు వేసుకుంది. చేతిలో ఒక గులాబీ రంగు టోపీ పట్టుకునుంది. "నీకు ఏ రంగు జుత్తు యిష్టం? బంగారు రంగా లేక గోధుమ రంగా?" అనడిగింది మేరీ. మా వాళ్ళని అలా అడగమంది. మేరీ ఎప్పుడూ బుద్ధిగా మా చెప్పినట్లే చేసేది. లోటీ ఏం చెబుతుందో వినాలని లారా తహ తహ లాడింది. కాని ఎందుకో దిగు

శేసింది. "నాకు రెండు రంగులూ యిష్టమే" అంది లోటీ నవ్వుతూ. వాళ్ళిద్దరిని చెరివొక చేత్తో పట్టుకుని యింట్లో ప్రవేశించింది. వాళ్ళిద్దరూ సంతోషంతో గంతులేయటం ప్రారంభించారు.

కిటికీల గుండా యింట్లోకి ఎండపడుతోంది. ఇంట్లో ప్రతి వస్తువు శుభ్రంగా తళ తళ లాడుతూంది. అన్నంతినే బల్లమీద ఎర్రటి గుడ్డ కప్పివుంది. నిప్పురాజేసే పొయి నుసుపుపెట్టి మిల మిలలాడుతోంది. భోజనాల గది బార్లా తెరిచివుంది. లోపల అలమారులో వస్తువులన్నీ బైటికి కన పడుతున్నాయి. వంటలన్ని ఘుమఘుమ లాడుతున్నాయి. అప్పుడే నిద్రలేచి సుసాన్ ఆటకమీంచి కిందికి దిగింది. ఆ దృశ్యమంతా చుడ్డానికెంతో మనోహరంగా వుంది. లారా మనసు సంతోషంతో నిండిపోయింది. ఆ రోజు లారాని చూసినవారెవరూ ఆ సాయంత్రమే లారా చిలిపిగా ప్రవర్తిస్తుందని ఊహించి వుండరు.

లోటీ యింటికి వెళ్ళిపోయింది. లారాకీ, మేరీకీ ఎంతో అలసటగా, చిరాగ్గావుంది. అడవిలోకి వెళ్ళి పొద్దుట పొయి రాజేసేందుకు చెక్కముక్కలు ఏరటం ప్రారంభించారు. ఆ ముక్కలు ఏరటం వాళ్ళిద్దరికీ చాలా విసుగు. కాని ప్రతి రోజూ అలా ఏరక తప్పేది కాదు. ఆరోజు విసుగు మరీ ఎక్కువయింది యిద్దరికీ, లారా పెద్ద ముక్క ఏరింది. మేరీ ఉడుక్కుంది. "మరేం ఫర్వాలేదు. లోటీకి నా జుత్తు అంటేనే యిష్టం. బంగారు రంగు జుత్తు గోధుమరంగు జుత్తు కంటె లక్షరెట్లు బాగుంటుంది" అన్నది మేరీ. లారాకి దుఃఖం ముంచుకొచ్చేసింది. బంగారు రంగు జుత్తు బాగుం టుందని లారాకి తెలుసు. అందుకని నోట మాటరాలేదు. వెంటనే మేరీ దగ్గరగా వెళ్ళి, ఈడ్చి లెంపకాయ కొట్టింది. ఇంతలో "ఇలారా లారా" అని పిలిచాడు పా. మెల్లిగా-

కాళ్ళీడ్చుకుంటూ పా దగ్గిరికి వెళ్లింది లారా. గదిలోపల కూర్చున్న పా లారా మేరీ ని కొట్టడం చూశాడు. "మీరి ద్దరూ ఒకర్ని ఒకరు కొట్టుకోకూడదని చెప్పాను. జ్ఞాపక ముందా!" అన్నాడు పా. "కాని మేరీ"......అంటూ మధ్యలో ప్రారంభించింది లారా. ఆ విషయమంతా ఇప్పుడు వద్దు. నేను చెప్పిన మాట మటుకు మరిచిపోకండి" అంటూ గోడమీంచి బెత్తం తీసి, లారాని కొట్టాడు. పా.

ఓ మూల కుర్చీలో కూర్చుని, లారా కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. ఏడవటమయాక, దిగులుగా కూర్చుంది. ఈ ప్రపంచంలోకల్లా లారాకి అప్పుడు ఒక్కటే విషయం సంతోషాన్నిచ్చింది. అదేమిటంటే, ఆ వేళ చెక్కముక్కలన్నీ మేరీయే ఏరాలి!

చిట్టచివరకి, చీకటిపడుతుండగా, "ఇలా రా లారా!" అని మళ్ళీ పిలిచాడు పా. పా పిలుపులో దయ ఉట్టిపడు తోంది. లారా దగ్గరగా రాగానే, ఒళ్ళోకి తీసుకుని గుండె లకి హత్తుకున్నాడు. అతని బుజంమీద తల ఆనించి మూలగా ఒదిగింది లారా. పా గడ్డం లారా కళ్ళమీద పడింది. మళ్ళీ అంతా మామూలు అయిపోయింది. జరిగినదంతా పాకి చెప్పింది లారా. "నీ మటుకు నీకు గోధుమరంగు జుత్తే ఇష్టం కదూ!" అనడిగింది లారా. పా లారావంక చూసి నవ్వాడు. "చూడు! నా జుత్తుకూడా గోధుమరంగే" అన్నాడు.

ఆ విషయం అంతకు ముందెన్నడూ తట్టనేలేదు లారాకి. పా జుత్తు, మీసాలు గోధుమ రంగులోనే వున్నాయి. లారాకి ఆ రంగే ఎంతో బాగుందనిపించింది. అన్నిటికంటె ముఖ్యంగా ఆ వేళ చెక్కలన్నీ మేరీయే ఏరుతున్నందుకు సంతోషించింది.

వేసంగిలో సాయంత్రం పూటలు పా కథలు చెప్పే వాడు కాదు. సితార్ వాయించేవాడు కాదు. పగలంతా

పొలంలో పనిచేసి, అలసిపోయి యింటికి వచ్చేవాడు. మా కి కూడా క్షణం తీరిక ఉండేది కాదు. తోట వెయ్యటంలోనూ, కోళ్ళనీ, గుడ్లనీ చూసుకోవటంలోనూ, లారా, మేరీలు ఆమెకి సాయంచేసేవారు. అడవిలో బాగా గడ్డి పెరిగి, ఆవులు సమృద్ధిగా పాలు యిచ్చే సమయంలో వాళ్ళు చీస్ తయారుచేసేవారు. చిన్న దూడని చంపి, ఆ దూడ కడుపు పొరతో చీస్ చేసేవారు. దూడ చాలా చిన్నదై యుండటమే కాదు, పాలు తప్ప మరే ఆహారం తీసుకుని ఉండకూడదు.

గాదెలోని చిన్న చిన్న దూడలను చూస్తే లారాకి ఎంతో యిష్టం. పెద్ద కళ్లు, మెత్తని జూలు, అందులో ఒకటి ఎర్రగాను, ఇంకోటి లేతపసుపు రంగులోను ఉండేది. పా వాటిల్లో ఒకదాన్ని చంపవలసి వస్తుందని లారా భయపడేది. చీస్ చేసే విషయం మా పా తో చెబుతుంటే, లారా గుండె భయంతో దడదడ కొట్టుకునేది. కాని అవి రెండూ ఆడ దూడలవటంవల్ల పా వాటిని చంపలేదు. తాతయ్య ఇంటికి వెళ్ళి చీస్ చేసే విషయం మాట్లాడాడు. పెద్దనాన్న తన దూడల్లో ఒకదాన్ని చంపుతానన్నాడు. పా మళ్ళీ తాతయ్య ఇంటికి వెళ్ళి దూడతోలు తీసుకువచ్చాడు. అది బూడిద రంగులో తోలుకిమల్లె వుంది. ఒకపక్క మటుకు గరుగ్గా గుచ్చుకుంటోంది.

మా రాత్రిళ్లు పాలు పితికేది. పాలన్నీ గిన్నెల్లో తీసి పెట్టేది. పొద్దున్నే పాలు కాచి మీగడ తీసేది. పొద్దున్న మళ్ళీ పాలు పితికి, అవి చల్లారిన తర్వాత, రాత్రి పాలతో కలిపేది. రెండిటినీ పొయిమీద కాగబెట్టేది.

దూడతోలుని గుడ్డతో కట్టి, వెచ్చని నీళ్ళల్లో నాన బెట్టేది. పాలు బాగా కాగిన తర్వాత గుడ్డని పిండి, ఆ

నీళ్ళను పాలల్లో పోసేది. ఆ పాలని బాగా కలియబెట్టి, పొయి పక్కగా ఒక వెచ్చని స్థలంలో పెట్టివుంచేది. కాసేపటికి అది గట్టిపడేది. ఒక పొడుగాటి కత్తితో ఆ గడ్డని ముక్కలు ముక్కలుగా కోసేది. మళ్ళా గుడ్డ తీసుకుని, ఆ ముక్కలను వడగట్టేది. ఆ ముక్కల్లో ఒక చుక్కకూడా నీళ్లు లేవని రూఢి అయాక, వాటిమీద బాగా ఉప్పుజల్లేది. చీస్ చేస్తున్నంతసేపూ లారా, మేరీ పక్కనే నిలబడి మాకి సాయంచేసేవారు. మా ఉప్పు చల్లుతుంటే, చిన్న చిన్న మీగడ ముక్కల్ని నోట్లో వేసుకునేవారు.

పెరట్లో చెట్టుకింద పా ఒక పలక తీసుకొచ్చి వేశాడు. ఆ పలక పొడుగుతా రెండు గీట్లు వేశాడు. ఆ పలకని ఏటవాలుగా రెండు రాళ్ళమీద ఉంచాడు. పలక అంచున ఒక గిన్నె వుంది. మా ఒక వెడల్పాటి గిన్నె తీసుకొచ్చి ఆ పలకమీద పెట్టింది. దాని అడుగున తడిగుడ్డవేసి, దాంట్లో ఊరేసిన క్యారట్ ముక్కలు వేసింది. దానిమీద మళ్ళీ ఒక తడిగుడ్డ వేసి. గిన్నెలోపలకి పోయేట్లు ఒక పలక దానిమీద పెట్టేది. తర్వాత ఒక బరువైనరాయి ఆ పలకమీద పెట్టేది. ముక్కలు వేసిన గిన్నెకి అడుగున ఏమీ లేకపోవటంవల్ల, రాయిబరువుకి ముక్కలలోని రసమంతా కారి, పలకమీద బీట్లగుండా కింద గిన్నెలోకి కారేది. ఒక రోజంతా అలా నెమ్మదిగా రసం కారుతూనే వుండేది. పొద్దున్నయ్యేటప్పటికి గిన్నెలోని పసుప్పచ్చ ముక్కలు తీసేసి, మళ్ళీ గిన్నె నిండా మీగడ నింపేది మా. రోజూ పొద్దున్నే అలా మీగడ తీసి, ఒక్కొక్క ముక్క చుట్టూ గుడ్డకట్టి, ఆ గుడ్డకి పైన వెన్న రాసి, వంటింట్లో దాచేసేది. రోజూ మళ్ళీ ఆ గుడ్డమీద వెన్న తుడిచేసి, అవతలపక్క వెన్న రాసి దాస్తుండేది. అలా కొన్నాళ్ళకి మీగడ చుట్టూ చెక్కు కట్టి, అది ఎండేది. తర్వాత మా వాటిని పొట్లం కట్టి, ఎత్తుగా అలమారులో దాచేసేది. అంతటితో చీస్ చేయటం ముగిసేది.

లారాకీ, మేరీకీ చీస్ చేస్తున్నారంటే బలే హుషారుగా ఉండేది. ముందుగానే మీగడ ముక్కల్ని తినటం, గుడ్డలో కట్టేముందు మా వాటిని తుడుస్తున్నప్పుడు, కింద పడిన పొట్టుని తినటం వాళ్ళకెంతో యిష్టం.

చీస్ యింకా పూర్తిగా తయారు కాకముందే, ఆకు పచ్చగా ఉన్నప్పుడే తినేస్తున్నందుకు లారాని, మేరీని చూసి నవ్వేది మా. "చందమామని ఈ పచ్చమీగడతోనే చేశారు అంటారు కొందరు" అంది మా. కాని చెట్లు వెన కాతల చందమామ పచ్చమీగడలా లేదు. చీస్ పూర్తయాక పసుపు పచ్చగా ఉన్నప్పుడే చందమామ పోలిక కనబడింది. "నిజంగా చందమామని మీగడతో చేశారా?" అనడిగింది లారా. మా నవ్వింది. "చూట్టానికి అలా ఉంటుంది కనుక అందరూ అలా అంటారనుకుంటాను. కాని పైపైన చూసి మోసపోకూడదు" అంది. తర్వాత మీగడ తుడుస్తూ చందమామని గురించి చెప్పింది. చందమామంటే ఒక చిన్న ప్రపంచమన్నమాట. అక్కడ ఏమీ పెరగవు. అంటే మనుష్యులు, చెట్లు వుండవు. అంతా చల్లగా, నిర్మానుష్యంగా ఉంటుంది.

మా మొదటిరోజు చీస్ చేసినప్పుడు, లారా మాతో చెప్పకుండా మీగడనుంచి కారిన పాలని రుచిచూసింది. మా లారావంక తిరిగి చూసి ఫక్కున నవ్వింది. లారా ఆముదం తాగిన ముఖం పెట్టింది. ఆవేళ రాత్రి మా వంట గిన్నెలు కడుగుతోంది. లారా, మేరీ వాటిని శుభ్రంగా తుడుస్తున్నారు. లారా చేసిన సంగతి పాతో చెప్పింది మా. "పూర్వం గ్రాంప్స్ అనే అతను పాలు రుచిచూసి చచ్చి పోయాడు. నువ్వు అలాగ చావవులే" అన్నాడు పా. లారా తనకి ఆ గ్రాంప్స్ కథ చెప్పమని బతిమాలింది. బాగా

అలసిపోయి వున్నా, పా పెట్టెలోంచి సితార్ తీసి పాడటం ప్రారంభించాడు.

"ముసలి గ్రాము మంచివాడు, పాపం
చచ్చిపోయాడు,
గ్రాము యిక మనకి కనబడడు,
అతను ఒక బూడిదరంగు కోటు తొడుక్కునేవాడు,
ఆ కోటు ముందంతా బొత్తాములుండేవి,
గ్రాము భార్య ఓ మాటు చీస్ చేసింది,
ముసలి గ్రాము పాపం పాలు తాగాడు,
ఉన్నట్లుండి పడమటినుంచి ఉత్తరపుగాలి వచ్చింది,

ముసలి గ్రామ్నుని గాలి కొట్టుకుపోయింది" అదీ కథ! గ్రాము భార్య చాలా లోభి. ఒక్క పిసరు కూడా వుంచకుండా పాలమీద మీగడంతా తీసేసింది. పాపం! అందులో కాస్తంతయినా మిగిల్చివుంటే గ్రాము అలా నిస్సారంగా గాలిలో కొట్టుకుపోయేవాడు కాదు. తాగిన దాంట్లో బలం లేక, బక్కచిక్కి, గాలిలో తేలిపోయి, గ్రాము ప్రాణాలు వదిలాడు." అన్నాడు. పా ఆతర్వాత మా వంక చూసి "కారొలిన్! నువ్వున్నంత కాలం మాకు ఆ భయంలేదు" అన్నాడు. మా అందుకుని, "అబ్బే! నాదేముంది! ఇదంతా మీ చలవే." అన్నది. అలా ఆ సేసరికి పా ముఖం వికసించింది. సితార పక్కన పెట్టేసి, పా మెల్లిగా ఈల వేస్తూ పాడాడు. మా గిన్నెలు కడుగుతోంది. వేసంగి సాయంకాలం చల్లగాలి వీస్తోంది. వాతావరణమంతా ఎంతో చక్కగా వుంది.

కాస్సేపటికి పా, "రేపు పొద్దున్న హాన్సీయింటికెళ్లి పాలు తేవాలి. గోధుమపంట పక్వానికి వచ్చింది. ఇక దాన్ని

కనిపెట్టి వుండేందుకు ఎప్పుడూ చేనులో ఒక మనిషి వుండ వలసి వస్తుంది." అన్నాడు.

మర్నాడు పొద్దున్నే మామయ్య యింటికి వెళ్ళాడు. కాని మళ్ళా వెంటనే తిరిగి వచ్చేశాడు. బండీకి గుఱ్ఱాలని కట్టి, బండీలో గొడ్డలి, నీళ్ళ కాగు, తొట్టెలూ వేసుకున్నాడు. "ఇవన్నీ అవసరమొస్తాయో లేవో తెలీదు కారలిన్. కాని సమయానికి దగ్గరే లేక పోవటం నాకు యిష్టం వుండదు" అన్నాడు పా. "ఇదంతా ఏమిటి?" అని అడుగుతూ లారా సంతోషంతో గంతులేయటం ప్రారంభించింది. "పాకి ఒక తేనెతుట్టవున్న చెట్టు కనుపించిందట. బహుశః మనకు కొంచెం తేనె తీసుకువస్తాడు" అంది మా.

పా యింటికి వచ్చేటప్పటికి ఎండెక్కింది. లారా పా కోసం కాచుకుని వుంది. గాదె పక్కన బండీ ఆగుతూనే లారా బండీ దగ్గరకి పరుగెత్తింది. కాని లోపలేమీ కనుపించ లేదు. "కారలిన్! నువ్వు యిటువచ్చి కాస్త ఈ గిన్నెడు తేనెని లోపలికి పట్టుకెళ్లు. నేను గుఱ్ఱాలని కట్టేసి వస్తాను" అని కేక వేశాడు పా. మా ఎంతో నిరుత్సాహంతో బండీ దగ్గరకి వచ్చింది. గిన్నెడు తేనే అయినా ఫరవాలేదులెండి" అంటూ బండీ లోకి తొంగిచూసింది. వెంటనే ఆశ్చర్యంతో పా వంక చూసింది. పా పక పక నవ్వాడు. బండీలో తొట్టెలు, ముంతలు, అన్నీ తేనెతో నిండివున్నాయి. నీళ్ల కాగు. నీళ్ళ తొట్టెకూడా తేనెతో నిండుకుని వున్నాయి. మా, పా కలిసి ఆ తొట్టెలన్నీ యింట్లోకి జారేశారు.

మా ఒక పళ్ళెంనిండా తేనే తీసివుంచి, తరిమ్మాది శుభ్రంగా గుడ్డతో చుట్టి, దాచేసింది. ఆ రోజు భోజనంలో కోరినంత తేనె వేసుకు తిన్నారు వాళ్ళు. భోజనం చేస్తుం డగా తనకి ఆ తేనె చెట్టు ఎలా కనపడిందీ చెప్పాడు పా.

ఆ వేసంగిలో చిఱుతపులులు, ఎలుగుబంట్లు బాగా తిని, బలిసి పోయి బద్ధకంగా పడుకునుంటాయి. అందుకని బైటికి వెళ్ళేటప్పుడు, తుపాకీ తీసుకువెళ్ళవలసిన అవసరం లేదు. అసలు వేటాడుదామన్నా జంతువులు దొరకవు. అందుకని మామూలు ప్రకారం తుపాకీ లేకుండానే ఇవేళ కూడా బైటికి వెళ్ళాను. అడ్డదారిలో చిట్టడవిలోంచి వెళుతుంటే ఒక పెద్ద ఎలుగుబంటి ఎదురు పడింది. దాన్ని తప్పించుకునేందుకు చెట్ల గుబురులోకి పోయి దాక్కున్నాను. ఎలుగుబంటికీ నాకూ అట్టే దూరం లేదు. ఆ ఎలుగుబంటి నాకేసి సూటిగా చూసింది. బహుశః నా దగ్గర తుపాకీ లేని విషయం దానికి తెలిసివుండాలి. ఇంతలో అది నిలబడ్డ చెట్టుమీంచి జుంయ్ మంటూ తేనెటీగలు బైటికి వచ్చాయి. ఎలుగుబంటిని చుట్టుముట్టేశాయి. కాని ఎలుగుబంటి జూలు దట్టంగా వుండటం వల్ల దానికి బాధకలగలేదు. ఒక చేత్తో ఎలుగుబంటి ఆ తేనెటీగలని తోలటం మొదలుపెట్టింది. నేను కాస్తదూరంలో నిలబడి ఆ ఎలుగుబంటికేసి చూస్తున్నాను. ఇంతలో ఎలుగుబంటి చెట్టు తొర్రలో చెయిపెట్టింది. ఆ చేతినిండా తేనె అంటుకుంది. తేనెని నాకి చూసి, రుచిగా వుందనుకుంటూ మళ్ళా తొర్రలో చెయి పెట్టింది. ఎల్లాగయినా ఆ తేనెను నేను కాజేయాలనుకున్నాను. అదృష్ట వశాత్తూ నాకు ఒక దుడ్డుకర్ర కనుపించింది. ఆ కర్రని ఒక చెట్టుకేసి బాదుతూ, కీచుగా అరిచి ఒక తమాషా చేశాను. దాంతో బాగా తేనె తాగి మత్తులో వున్న ఎలుగుబంటి భయపడుతూ పారిపోయింది. కొంత దూరం దాన్ని తరుముకు వెళ్ళి, తర్వాత నా బండీ దగ్గరకి పరుగెత్తుకొచ్చాను. “చెట్టులోంచి తేనె ఎలా తీశావో చెప్పమనడిగింది లారా.

“అది చాలా సులభం. తేనెటీగలు కుట్టకుండా గుర్రాలని అడవిలో దూరంగా కట్టేశాను. తర్వాత గొడ్డలితో

చెట్టుని రెండుగా కొట్టాను." అన్నాడు. "తేనెటీగలు నిన్ను కుట్టలేదా?" అంది లారా. "ఊహూ! అవి నన్ను ఎప్పుడూ కుట్టవు" అన్నాడు పా. "ఆ చెట్టు తొర్రనిండా తేనెవుంది. బహుశః కొన్ని సంవత్సరాలనుంచీ తేనెటీగలు అక్కడ తేనె నిలవచేస్తూ వుండాలి. అందులో కొంత భాగం నల్లగా, పాతపడివుంది. అందులో మంచి తేనెని మటుకు నేను యింటికి పట్టుకొచ్చాను." అన్నాడు. లారాకి ఆ తేనెటీగలని చూస్తే జాలేసింది. "పాపం! ఎంతో కష్టపడి అవి తేనెని దాచుకున్నాయి. ఇప్పుడు కాస్త కూడా లేకుండా పోయింది" అంది. కాని కావలసినంత తేనె చెట్టులో మిగిలివుందని చెప్పాడుపా. అంతే కాదు' దగ్గిరగా యింకో చెట్టు వుంది. అవి చక్కగా ఆ చెట్టులో వుండవచ్చు. ఒక్కొక్క చెట్టులో అవి ఎన్నో రోజులుండ కూడదు. మారుతూవుండాలి. పా వదిలిపెట్టిన పాత తేనెని మళ్ళా శుభ్రంచేసుకుని, ఆ కొత్త చెట్టులో పెట్టుకోవచ్చు. ఆ విధంగా చలి కాలమొచ్చేలోపు బోలెడంత తేనె నిలవ చెయ్యవచ్చు.

# 9

పంటలు కోతకి రాగానే, పా, మామయ్య ఒకరికొకరు సాయంచేసుకునేవారు. ముందు పా పొలంలో వరి పండగానే మామయ్య పాకి సాయం చేయటానికి వచ్చేవాడు. కూడా అత్తయ్య, పిల్లలు వచ్చి మా యింట్లో కాలక్షేపం చేసేవారు. తర్వాత మామయ్యకి పొలంలో సాయపడేందుకు పా అతనికూడా వెళ్ళేవాడు. లారాని, మేరీని, కారీని వెంటబెట్టుకుని మా పాని అనుసరించేది.

మా, అత్తయ్య వంటింట్లో పని చూసుకుంటుంటే, పిల్లలంతా పెరట్లో చెట్ల దగ్గిర ఆడుకునేందుకు వీలుగా వుండేది. అందరిలోకి చిన్నది లారా...అయినా పొట్టిగా వున్న చెట్లనుంచి లారా దూక కలిగేది. చార్లెస్ దాదాపు పెరట్లోని చెట్లన్నిటి మీంచి దూకకలిగేవాడు. చిన్న చిన్న గా

వున్న చెట్లని, రెండేసి చెట్లని ఒక్కసారి దాటగలిగేవాడు. ఇంటిచుట్టూ వున్న కంచెమీంచి నిర్భయంగా నడిచేవాడు.

పొలంలో పా, మామయ్య పంట కోసేవారు. పొడుగాటి కొయ్యపలకల అంచున కత్తి కట్టి, పంట కోసేవారు. కోత పూర్తయాక, దాన్ని బొత్తుగా చేసి, విడివిడిగా కుప్పలు పోసేవారు. మండుటెండలో పొలమంతా కలియ తిరుగుతూ, పంటకోయటం, వాటిని కుప్పలు పోయటం ఎంతో శ్రమతో కూడుకున్న పని. పంటంతా కోయటం పూర్తయాక, పా, మామయ్య మళ్ళా పొలానికి వెళ్ళవలసివచ్చేది. కుప్పలుగాపోసిన పంటని దగ్గరగా చేర్చి, విడి విడిగా తాడుతో గట్టిగా బిగించేవారు. అలా ఏడు మూటలు కట్టాక, అయిదు మూటల్ని దగ్గర దగ్గరగా వరుసగా నిలబెట్టి, వాటిమీద మరో రెండు మూటల్ని పైకప్పుకి మల్లె పెట్టేవారు. అలా చీకటి పడేలోపు మూటలన్నిటిని జాగ్రత్తచేసేవారు. లేకపోతే రాత్రి మంచుకి అవి చెడిపోతాయి. అంతేకాదు; వేడిగా ఈ మరుగాలి వీస్తోంది. అయినా వర్షం వచ్చే ప్రమాదం వుంది. వానకురిస్తే పండిన వరి అంతా వృధాఅయిపోతుంది. ఆ చలికాలమంతా హెన్రీ గుఱ్ఱాలు పస్తుండ వలసి వస్తుంది. అందుకని పా, హెన్రీ ఊపిరి సలుప వ్యవధలేకుండా పనిచేయటం ప్రారంభించారు.

ఆ వేళ మధ్యాహ్నం వాళ్ళిద్దరూ హడావుడిగా యింటికి వచ్చారు. నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, మళ్ళా గబగబ పొలంకి వెళ్ళిపోయారు. సాయంత్రం చార్లీ కూడా వాళ్ళకి సాయపడాలన్నాడు హెన్రీ. మామయ్య ఆ మాట అంటుంటే, లారా పా వంక చూసింది. అత్తయ్య, మామయ్య కలిసి చార్లీని చెడగొడుతున్నారని పా, మాతో అంటూండటం లారా విన్నది. పన్నెండేళ్లు వచ్చినా చార్లీ

పొలంలో అడుకునేడువాడు కానీ పనిచేసేవాడు కాదు. ఆ రోజు చార్లీ పొలంకి వచ్చి తీరాలన్నాడు హెన్రీ.

పాకీ, హెన్రీకీ చార్లీ ఎంతయినా సాయపడగలడు. చెరువుకి వెళ్ళి నీళ్ళు తెవట, దాహం వేసినప్పుడు నీళ్ళు అందించటం చేయవచ్చు. పంటకోసే కత్తులకి సానబెట్టే రాళ్ళు వెతికి తేవచ్చు. చార్లీ ఏం సమాధానం చెబుతాడా అని పిల్లలంతా అతని ముఖం కేసి చూశారు. ఛార్లీకి పెరట్లోనే వుండి ఆడుకోవాలని పించింది. కాని పైకి ఆ మాట అనలేకపోయాడు పా, హెన్రీ అసలు విశ్రాంతే తీసుకో లేదు. భోజనం ముగించగానే తిన్నగా పొలానికి వెళ్ళారు. చార్లీ వాళ్ళని అనుసరించాడు.

ఇక మిగిలిన పిల్లల్లో మేరీయే పెద్దది. నెమ్మదిగా, పెద్దమనిషి తరహాగా ఉండే ఆట ఆడాలంది మేరీ. అందుకని ఆవేళ సాయింత్రం వాళ్ళు పెరట్లో ఒక బొమ్మరిల్లు కట్టారు. చెట్టు కొమ్మలు కుర్చీలు, బల్లలుగా పెట్టారు. ఆకులు తినుబండారాలుగానూ, కర్రపుల్లలు మనుష్యులుగానూ పెట్టుకున్నారు. సందడి లేకుండా ఎంతో నిశ్శబ్దంగా గడిచిపోయింది ఆ ఆట. ఆవేళ రాత్రి మామయ్య ఇంటినుంచి తిరిగి వస్తుంటే, పొలంలో జరిగిన సంగతంతా చెప్పాడు పా మా కి.

పొలంలో పా కీ, మామయ్యకీ సాయంచేసేబదులు చార్లీ అల్లరిచేశాడు. పంట కోయటానికి వీలులేకుండా వాళ్లకి అడ్డువచ్చాడు. కత్తి పదును బెట్టే రాయిని దాచేశాడు. దాని కోసం వాళ్లు ఎంతోసేపు వెతకవలసి వచ్చింది. మంచినీళ్ళు పట్టుకురమ్మని నాలుగయిదుసార్లు కేకలు పెడితే గాని తేలేదు. ఆ తర్వాత ముఖం ముడుచుకు కూర్చున్నాడు. వాళ్ళ కూడా కూడా తిరిగి, చొప్పదంటు ప్రశ్నలు వేస్తూ, వాగటం ప్రారం

ఖించాడు. పనిచేసే హడావుడిలో ఉండటంవల్ల వాళ్ళకి విసుగు పుట్టింది. వాణ్ణి దూరంగా పొమ్మని కోప్పడ్డారు. కాని వాడు ఏడుపు లంకించుకోగానే, కత్తులు పారేసి వాడి వైపు పరుగెత్తారు. పొలంలో అక్కడక్కడ పాములున్నా యని భయపడి వాణ్ణి వెతకసాగారు. తీరా వెళ్ళి చూసేసరికి వాడికేమీ ప్రమాదం జరగలేదు. పైపెచ్చు వాళ్ళని చూసి పళ్ళు ఇకిలించాడు. "మిమ్మల్ని తమాషా చేసేందుకు ఏడ్చాను" అన్నాడు.

తనే మామయ్య స్థానంలో వుంటే, వాడికాట ఒలిచే వాణ్ణి అన్నాడు పా. కాని మామయ్య వాణ్ణి కొట్టలేదు. ఒక ముంతెడు మంచినీళ్లు తాగి, వగర్చుకుంటూ వాళ్లు మళ్ళీ పొలంలోకి వెళ్ళారు. ఆ రోజు మూడుసార్లు వాడు అరిచాడు. మూడుసార్లూ మామయ్యా, పా పరుగెత్తుకెళ్ళారు. కాని వాడు ఉత్తినే తమాషా చేశాడు. అప్పటికీ మామయ్య వాణ్ణి కొట్టలేదు.

తర్వాత నాలుగోసారి వాడు యింకా గట్టిగా అరిచాడు. పా, మామయ్య తల ఎత్తి చూశారు. గంతులేస్తూ వాడు కేకలు పెడుతున్నాడు. అంతకుముందు చాలాసార్లు అదేవిధంగా మోసపోవటంవల్ల, వొంగి మళ్ళీ పనిచూసుకో సాగారు. చార్లీ కేకలు ఆపలేదు. పా ఏమీ అనలేదు. మామయ్య మటుకు, "అరవనీ!" అన్నాడు. ఇద్దరూ వాడి అరుపు వింటూనే పనిచేసుకుంటున్నారు. ఎంతసేపటికీ వాడు గంతులేస్తూ అరవటం మానలేదు. చివరకి "ఏమైనా అయిం దేమో!" అన్నాడు మామయ్య.

ఇద్దరూ కత్తులు కింద పెట్టి, వాడిదగ్గరకెళ్ళారు. అంతసేపూ చార్లీని తేనెటీగలు కుడుతున్నాయి. చార్లీ పొరపాటున వాటి పుట్టమీద కాలువేశాడు. అవి జుంయ్‌మని

పైకి వచ్చి, మనిషిని కదలనివ్వకుండా కుట్టసాగాయి. వాడు బాధతో గంతులేస్తున్నాడు. చుట్టూ తేనెటీగలు ముసిరి ఉన్నాయి. మెడ, ముఖం, చేతులు, కాళ్ళూ అన్నిచోట్లా పట్టుకు పీకేస్తున్నాయి. వాడు బాధతో ఎగిరినకొద్దీ అవి మరీ ఎక్కువగా కుడుతున్నాయి.

పా, మామయ్య వాణ్ణి చెయిపుచ్చుకు ఇవతలకులాక్కు వచ్చారు. బట్టలు తీసేసి చూస్తే, తేనెటీగలు కుట్టినచోట ఒళ్ళంతా వాచివుంది. వాటిని చంపేసి, బట్టలు శుభ్రంగా దులిపి, వాణ్ణి యింటికి పంపించేశారు.

లారా, మేరీ పెరట్లో నిశ్శబ్దంగా ఆడుకుంటుంటే పెద్ద ఏడుపు వినిపించింది. పెడబొబ్బలు పెట్టుకుంటూ చార్లీ లోపలికి వచ్చాడు. కళ్లు, ముఖం బాగా వాచివున్నాయి. చేతులు, మెడకూడా వాచిపోయాయి. చేతి వేళ్ళు ఉబ్బివున్నాయి. ముఖంమీదా, మెడమీదా తెల్లని చుక్కలున్నాయి. పిల్లలంతా వాణ్ణి నోరు తెరుచుకు చూశారు.

మా, అత్తయ్యా యింట్లోంచి పరుగెత్తుకొచ్చి, వాణ్ణి జరిగినదంతా చెప్పమనడిగారు. అత్తయ్య వాణ్ణి ఇంట్లోకి తీసుకెళ్ళి బట్టలు తీసేసింది. మా తోటలోకి వెళ్ళి ఒక గిన్నె నిండా మట్టి తీసుకొచ్చింది. ఆ మట్టిని వాడి ఒంటికంతా పట్టించారు. ఒక పాత దుప్పటితో ఒళ్ళంతా కప్పేసి, మంచంమీద పడుకోబెట్టారు. ముక్కు, మూతీ మటుకు పైకి కనబడేట్లు ముఖమంతా కూడా కప్పేసింది అత్తయ్య. జ్వరం రాకుండా మూలికలు తెచ్చి వాడినోట్లో వేసింది. పిల్లలంతా వాడి చుట్టూ చేరి, చూస్తూ నిలబడ్డారు.

ఆవేళ మామయ్యా, పా పొలంనుంచి వచ్చేటప్పటికి బాగా చీకటిపడింది. పంటని వాళ్లు జాగ్రత్తచేసి వచ్చారు.

ఇక వానకురిసినా ఫర్వాలేదు. పా రాత్రి భోజనానికి ఉండలేనన్నాడు. ఇంట్లో ఆవులు కాచుకుని వుంటాయి. ఆవేళ రాత్రిగనుక పాలు తియ్యకపోతే, అమర్నాడు అవి సరిగ్గా పాలు యివ్వవు. అందుకన్నితొందరగా గుర్రాలను కట్టి బండీ సిద్ధం చేశాడు. అందరూ బండీ ఎక్కారు.

పా బాగా అలసిపోయాడు. చేతులు నొప్పులు పెడుతుండటంవల్ల బండీ సరిగ్గా తోలలేకపోయాడు. కాని గుర్రాలకి దారి తెలియటంవల్ల బండీ చకచక సాగిపోయింది. కారీని ఎత్తుకుని మా పా పక్కనే కూర్చుంది. వెనకాల మేరీ, లారాలు కూర్చున్నారు. అప్పుడు పా చార్లీ సంగతి చెప్పాడు.

చార్లీ కథ వినేసరికి లారాకి, మేరీకీ ఆశ్చర్యమేసింది. వాళ్ళూ అప్పుడప్పుడు అల్లరి చేసేవారుగానీ మరీ చార్లీ అంత విపరీతంగా ప్రవర్తించలేదు. చార్లీ తండ్రికి సాయపడలేదు. తండ్రి పిలిస్తే వెంటనే జవాబయినా యివ్వలేదు. పా, మామయ్య కష్టపడి పొలంలో పనిచేస్తుంటే వాళ్ళని ఏడిపించుకు తిన్నాడు. లారా, మేరీలు ఎప్పుడూ అంత అల్లరి చేయలేదు.

తర్వాత పా తేనెటీగల సంగతి చెప్పాడు. "అబద్ధాలు చెప్పినందుకు వాడికి తగినశాస్తి అయింది" అన్నాడు.

ఆ వేళ రాత్రి బాగా వానకురిసింది. లారా మంచం మీద పడుకుని, బైట వానపడుతున్న చప్పుడూ వింటూ, పా చెప్పిన విషయాన్ని గురించి ఆలోచించసాగింది. తేనెటీగలు ఛార్లీని కుట్టడం న్యాయమే. ఛార్లీ అసహ్యంగా ప్రవర్తించాడు గనుక అవి కుట్టవలసిందే. అదే గాక ఛార్లీ వాటి పుట్టమీద కాలువేశాడు. కాని పా ఛార్లీ, అబద్ధం చెప్పాడని ఎందుకు అన్నాడో లారాకి బోధపడలేదు. ఛార్లీ నోరు తెరిచి ఒక్కమాట మాట్లాడలేదు. మరి అబద్ధం ఎలా ఆడాడా అని సందేహించింది లారా.

# 3

ఆ మర్నాడు పా పొలంనుంచి పెద్ద గడ్డి మోపు తీసుకువచ్చాడు. పసుపు పచ్చని పొడుగాటి పోచలని, ఏరి, నీళ్ల తొట్టెలో శుభ్రంగా కడిగింది మా. అవి బాగా మెత్తబడ్డాక తొట్టిపక్కనే కుర్చీ వేసుకు కూర్చుని, వాటిని అల్లటం ప్రారంభించింది. ఆ గడ్డిపోచలన్నీ సమంగా లేవు. వాటికి పైన ముళ్లు వేసి, జడలు జడలుగా అల్లికలు వేసింది. తీరుబడి అయినప్పుడెల్లా, ఆ తొట్టి దగ్గిర కూర్చుని వాటిని అల్లుతూనే వుంది. మొట్టమొదట ఏడు పోచలతో ఒక మెత్తని జడలా అల్లింది. ఆ తర్వాత కాస్త వెడల్పాటి ఎనిమిది పోచలు తీసుకుని దాని అంచునే కలిపి అల్లింది. అలా అన్నీ అల్లేశాక, సూది, దారం తీసుకుని, గట్టి కుట్లు వేసుకుంది. చివరికి అది ఒక చిన్న చాపలా తయారయింది. దాంతో ఒక టోపీ చేయబోతున్నానంది మా. ఆ తర్వాత మరికొన్ని గడ్డిపోచలతో దానిచుట్టూ అల్లి ఒక టోపీ

తయారుచేసింది. లారా, మేరీలకి చిన్న చిన్న టోపీలు అల్లింది. తనకీ పాకీ పెద్దటోపీలు అల్లింది. పా ఎండలో పెట్టుకెళ్ళేందుకు ఒక టోపీ, రోజూ వాడుకునేందుకు రెండు మొరటు టోపీలు, మొత్తం మూడు అల్లింది. అల్లిక పూర్తయాక ఒక్కొక్క టోపీనే పలకమీద ఎండబెట్టేది. చేతిలో తనకి కావలసిన విధంగా దాన్ని నొక్కి, ఎండ బెట్టేది. ఎండాక, అది టోపీ ఆకారంలో తయారయేది. మా చాలా చక్కని టోపీలు చేసేది. లారా మా పక్కనే కూర్చుని అదంతా శ్రద్ధగా చూసి నేర్చుకుంది. తనబొమ్మకి ఒక చిన్న టోపీ అల్లుకుంది.

క్రమంగా పొద్దు తక్కువ కావటం, రాత్రిళ్లు చలి వేయటం ప్రారంభించింది. ఒక రోజు రాత్రి జాక్ ఫ్రాస్టు వచ్చాడు. పొద్దున్నే కిటికీల మీద మంచు కనబడింది. చెట్ల ఆకులమీద అక్కడక్కడా మంచుబిందువులు కనబడ సాగాయి. ఆకులన్నీ పచ్చగా వుండటంపోయి, తెలాతెలా. బోతూ రాలిపోయాయి. ఇంటి చుట్టూతా కంచెమీద చెట్ల ఆకులు, పూవులు కింద రాలిపోయాయి. లారా మేరీ ఆపూవు లతో బొమ్మరింటిని నింపేశారు. చిట్టడవిలో చెట్లనుంచి ఆకులు, పళ్ళు, కాయలు ఒక్కొక్కటే కింద పడసాగాయి. ఉడుతలు ఆ కాయలనీ, పళ్లనీ ఎత్తుకెళ్ళి దాచుకున్నాయి. లారా, మేరీలు కూడా వీలయినంతవరకూ పళ్ళనీ, కాయ లనీ ఏరుకుతినేవారు. అలా ఏరుకోవటంలో వారికెంతో సరదా కనుపించేది.

తోటలో కాయగూరలు ఏరి దాచవలసిన సమయం వచ్చింది. ఇంట్లో అందరికీ క్షణం తీరిక లేనంత పని చుట్టు కుంది. పా మట్టిలోంచి ఉర్లగడ్డలు తవ్వుతోంటే, లారా, మేరీ వాటిని ఏరేవారు. అంతేకాదు; మట్టిలోంచి కారె ట్లూ, అనపకాయలు బైటికి లాగేవారు. నారింజరంగు

అనపకాయల్ని మా వేటకత్తితో రెండుముక్కలుగా కోసేది. లోపల గింజలన్నీ తీసేసి, ఆ ముక్కలని మళ్లా పొడుగ్గా తరిగేది. లారా మాకి సాయంచేసింది. పొయి మీద గిన్నెలో నీళ్ళుపోసి, అనపకాయ ముక్కల్ని అందులో వేసేది. ముక్కలు ఉడికిపోకుండా, అనపకాయ రసం మటుకుపోయేటట్లు, వాటిని ఎంతోసేపు పొయిమీద వుంచేది. అనపకాయ గిన్నెలో గట్టిగా వుండకక్కేది. బుడగలు బుడగలుగా, కుతకుత ఉడికేది. నీటిపైన బుడగలు వచ్చినప్పుడల్లా, ఘుమఘుమ వాసన వచ్చేది.

భోజనం దగ్గిర వంటకాలతో ఆడుకోకూడదని నియమం పెట్టింది మా. అంతేకాదు: పళ్ళెంలో ఒక వస్తువయినా వదలకుండా అన్నీ తినేయాలనేది. అందుకని అనపకాయ ముక్కల్ని చక్కని ఆకారంలో కోసి, పళ్లెంలో పెట్టేది. రొట్టెమీద ఆ ముక్కలు పెట్టుకుని రుచిగా భోజనం చేసేవాళ్ళు.

అప్పుడప్పుడూ వాళ్లు అనపకాయ తోలులోని గుజ్జు తినేవారు. మా ఆ గుజ్జునంతా శుభ్రంగా కత్తితో గీకేది. లారా దాన్ని ఒక పళ్ళెంలో పరిచి, వెన్న కలిపి తినేది. తరుచు మొక్కజొన్నలు, పాలు కలుపుకు తినేవాళ్ళు. మొక్కజొన్నలు తయారయేందుకు మూడురోజులు పట్టేది. లారాకి అవంటే ఎంత యిష్టమంటే అన్నాళ్ళు ఓపిక పట్ట లేకపోయేది.

మా మొదటిరోజు పొయిలో బూడిద అంతా తీసేసి దాన్ని శుభ్రం చేసేది. మంచి కట్టెలు తీసుకొచ్చి పొయిలో పెట్టి, ఆ బూడిద అంతా ఒక గుడ్డ సంచీలో దాచేది. ఆ వేళ రాత్రి పా పొలనుంచి మొక్కజొన్నలు పట్టుకొచ్చే వాడు. కత్తితో ఆ మొక్కజొన్నల గింజలన్నీ తీసేసి, ఒక

పెద్ద గిన్నెనిండా వేసేవాడు. మర్నాడు పొద్దున్నే మా, ఆ గింజలని, దాచివుంచిన బూడిదనీ ఒక గిన్నెలో వేసి, పొయిమీద పెట్టేది. గిన్నెనిండా నీళ్లు పోసి, ఉడక బెట్టేది. కాస్సేపటికి అవి బాగా ఉడికి, పగిలేవి. ఒక్కొక్క గింజే పగిలి పైపొట్టు రాలగానే, అమ్మ గిన్నెని బైటికి తీసుకెళ్ళేది. పెరట్లో ఒక తొట్టినిండా చెలువునించి తెచ్చిన చల్లని నీరు పోసేది. ఆ తర్వాత చొక్కా చేతులు పైకి మడిచి, తొట్టెలోకి ఒంగి, వాటిని కలియబెట్టేది. కాస్సేపటికి పైపొట్టు వచ్చేసి, వృత్త గింజలు నీళ్ళపైన తేలేవి. అలా గింజలపైన పొట్టు అంతా రాలేంతవరకూ, తొట్టెలో నీళ్ళు నింపుతూ, వాటిని కడుగుతూనే వుండేది.

తెల్లని సుందరని చేతులు, ఎర్రని చెక్కిళ్ళు, నల్లని మెత్తని జుత్తు, ఒంగి ఆ గింజలు కలియబెడుతుంటే, మా ఎంతో అందంగా కనపడేది. ఒక్క నీటిచుక్కయినా గౌను మీద వేసుకునేది కాదు. గింజలమీద పొట్టు తీయటమయాక, వాటిని ఒక పొడుగాటి కూజాలో వేసేది. ఒక్కొప్పుడు ఆ గింజలని పానకంతో నూ, పంది మాంసంతోనూ కలుపుకు తినేవారు. కాని లారాకి వాటిని పాలల్లో నానబెడితేనే ఎక్కువ యిష్టం.

చలికాలం వచ్చిందంటే, చేతినిండా పని, కడుపునిండా తిండి, తెలుసుకునేందుకు ఎన్నో కొత్త విషయాలు, బలే సరదాగా వుండేది. లారా పొద్దుటనుంచీ సాయంకాలం వరకూ ఉడతమల్లె కిచకిచ వాగుతూనే వుండేది.

ఒక రోజు పొద్దున్నే మంచులో రోడ్డుమీద పెద్ద యంత్రం కనపడింది లారాకి. ఆ యంత్రాన్ని నాలుగు గుర్రాలు ఈడుస్తున్నాయి. ఇద్దరు మనుష్యులు దాన్ని నడుపుతున్నారు. అది తిన్నగా పా, హెన్రీ, తాతయ్య పని

చేస్తున్న పొలంవైపు వెళ్ళింది, దానివెనకాల మరోచిన్న యంత్రం వుంది. దాన్ని ఇద్దరి మనుష్యులు నడుపుతున్నారు.

పా నూర్పుడు యంత్రాలు వచ్చాయని మాకి చెప్పేసి గబగబ పొలానికి పరుగెత్తాడు. మా అనుమతి తీసుకుని, లారా, మేరీలు కూడా పా వెనకాల వెళ్ళారు. దూరంగా నిలబడి యంత్రం పనిచేయటం చూడవచ్చు అన్నది మా.

హెన్రీ మామయ్య గుర్రంమీద హడావుడిగా వచ్చి, గుర్రాన్ని ఒక చెట్టుకి కట్టేశాడు. తర్వాత పా, మామయ్య కలసి ఎనిమిది గుర్రాలను యంత్రానికి కట్టారు. యంత్రం మధ్యన ఎనిమిది పొడుగాటి కర్రలున్నాయి. గుర్రాలను గొలుసులతో ఆ కర్రలకి కట్టారు. పెద్ద యంత్రాన్ని, చిన్న యంత్రాన్నీ కలుపుతూ, నేలను అంటుకుని ఒక పొడుగాటి ఇనపకడ్డీ వుంది. అదంతా చూసి లారా, మేరీలు ప్రశ్నల వర్షం కురిపించారు. పెద్ద యంత్రాన్ని తూర్పార పోసేంటారనీ, చిన్న యంత్రాన్ని గుర్రపు శక్తి (హార్స్ పవర్) అంటారనీ చెప్పాడు పా. ఎనిమిది గుర్రాలు తమ శక్తితో ఈడుస్తేగాని ఆ యంత్రం పనిచేయదు. అంతా సిద్ధమయాక, యంత్రంపైన కూర్చున్న మనిషి గుర్రాలను తోలాడు గుర్రాలు ఒకదాని వెనక ఒకటి, యంత్రం చుట్టూ పరుగెత్తసాగాయి. అలా పరుగెతుతున్నప్పుడు కింద ఇనపకడ్డీని జాగ్రత్తగా దాటుతూ వచ్చాయి. గుర్రాలు తిరగడంతో ఇనపకడ్డీ గుండ్రంగా తిరుగుతూ, తూర్పారపోసే యంత్రాన్ని కదిలించి ది. ఆ యంత్రాలు రెండూ కలసి పెద్ద శబ్దం చేశాయి. పొలం అంచున నిలబడి, ఒకళ్ళ చేతులు ఒకళ్ళు గట్టిగా పట్టుకుని, లారా, మేరీలు కళ్ళప్పగించి యంత్రాలను చూశారు. అంతకుముందెప్పుడూ వాళ్ళు యంత్రాన్ని చూడలేదు. అంత పెద్ద శబ్దం కూడా వినలేదు.

పొలంలో ఓ పక్క కుప్పగా గోధుమ పంటలు పోసి ఉన్నాయి. ఆ కుప్పమీద నిలబడి ఒకతను వాటిని కింద పలకమీదికి దొర్లించాడు. అక్కడ నిలబడ్డ వ్యక్తి వాటిని దగ్గరగా పోగుచేసి, తూర్పారపోసే యంత్రం అంచునవున్న కంతలో వేశాడు. ఆ కంతకి పొడుగాటి ఇనపపళ్లున్నాయి. కంతలో వేయగానే, ఆ ఇనపపళ్లు గోధుమల్ని మెత్తగా నొక్కాయి. యంత్రానికి అవతల పక్కగా గోధుమలు రాలసాగాయి. అక్కడ ఇద్దరు నిలబడి, చకచక కిందపడిన గోధుమల్ని గిన్నెతో కొలిచి పక్కనే కుప్పగా పోసేశారు. యంత్రం పెద్దగా శబ్దం చేస్తూ తిరుగుతోంది. పనివాళ్ళంతా ఆపకుండా గబగబ పనులు సాగిస్తున్నారు. లారా, మేరీల ఆశ్చర్యానికి అంతులేదు. ఒకర్నొకరు గట్టిగా కరుచుకు పట్టుకుని, నోర్లు తెరిచి ఆ యంత్రాలవంక చూశారు.

గుర్రాలు గుండ్రంగా తిరుగుతున్నాయి. "ఊ! తొందరగా! బద్ధకించక! పరుగెత్తు!" అంటూ మధ్య కూర్చున్న అతను గుర్రాలను తోలుతున్నాడు. తూర్పార పోసే యంత్రం గోధుమల్ని నలగకొడుతూనే వుంది. పా, హెన్రీ ఊపిరిసలపకుండా మూటల్ని కిందికి తోస్తూనే ఉన్నారు. అలా చాలాసేపు నిలబడి చూశాక, మాకి సాయం చేసేందుకు లారా, మేరీలు ఇంటికి పరుగెత్తారు.

పొయిమీద ఒక గిన్నెలో కాబేజీ, మాంసం ఉడుకుతున్నాయి. పక్కనే గిన్నెలో కేకు తయారవుతోంది. లారా, మేరీలు బల్ల సిద్ధంచేసి, దానిమీద రొట్టె, చీజ్, వెన్న, పాలు, ఊరగాయ ముక్కలు పెట్టారు. తర్వాత మా ఉడికిన ఉర్లగడ్డలు, కేకులు తీసుకువచ్చి బల్లమీద పెట్టింది. కప్పులలో టీ పోసింది.

మొక్కజొన్నతో చేసిన రొట్టెని జానీకేకు అని ఎందు కంటారో లారాకి బోధపడలేదు. ఆ విషయం మాకి కూడా తెలియదు. బహుశః పూర్వ యుగానికి ఉత్తరంనుంచి దక్షిణంవైపు వెళ్ళిన సైనికులు ఆ పేరు విషయం చెప్పగల రేమో! దక్షిణాన ఉండే జనం ఆ రొట్టెని ఎక్కువగా తినే వారు. అందుకని సరదాకి ఆ సైనికులు కేకు అని పేరు పెట్టి ఉంటారు. "దాన్ని ప్రయాణం కేకు" అని కొందరు అంటుంటే మా విన్నది. కాని ప్రయాణమప్పుడు తీసుకు వెళ్ళేంత మంచి రొట్టె కాదు అది.

ఆవేళ సాయంకాలానికి యంత్రాలతో పని పూర్తి అయింది. యంత్రం నడిపిన వాళ్ళకి కూలీలకింద గోధుమలు పైన పోట్టు యిచ్చారు. అక్కడనుంచి తిన్నగా పక్కన మరో పొలంలో పనిచేయటానికి వెళ్ళారు వాళ్లు.

ఆ రాత్రి పా బాగా అలసిపోయాడు. కాని హుషా రుగా ఉన్నాడు. మాతో యిలా అన్నాడు. "ఇవేళ ఆ యంత్రాలు చేసిన పనిని నేనూ, నాన్నా, హెన్రీ, పీటర్‌సన్ కలసి చేసినా కొన్ని వారాలు పట్టేది పూర్తవటానికి. అంతే కాదు; ఇవాళ మనకు దొరికినంత గోధుమలు కూడా దక్కేవి కావు. ఆ యంత్రాన్ని కొత్తగా కనిపెట్టారు. తలిమూర్ఖ వాళ్లంతా పాతకాలపు పద్ధతులనే పట్టుకు వేళ్ళాడవచ్చు. కాని నాకుమటుకు ముందంజవేసి, అన్నీ కొత్తవి కనిపెట్టా లనే ఉబలాటం వుంది. మనం యిప్పుడు ఉంటున్న తరం చాలా గొప్పది. ఈ తరంలో అనేక అభ్యుదయ పద్ధతులను కనిపెడుతున్నారు. నేను గోధుమలు పండించినంత కాలం చుట్టుపట్ల ఎక్కడైనా యంత్రం దొరికినంత కాలం దానినే ఉపయోగిస్తాను."

ఆ రోజు రాత్రి బాగా ఆలసిపుండటంవల్ల అతను ల్పారాతో కబుర్లు చెప్పలేదు. కాని లారా పా ని చూసి ఎంతో గర్వపడింది. పా ప్రోద్బలంవల్లనే, యిరుగు పొరుగు వారంతా ఆ యంత్రాన్ని ప్పుకువచ్చారు. ఆ యంత్రం చాలా గొప్పది. దాన్ని చూసి అందరూ ఆనందించారు.

• • •

వానా కాలం ప్రారంభమవుతూనే చెట్లఆకులన్నీ వాడి పోయాయి. పచ్చిక అంతా ఎండి, రాలిపోయింది. అందుకని ఆవుల్ని అడవిలోకి తీసుకువెళ్ళకుండా యింట్లోనే కట్టేశారు. బైట వానపడుతుండటంవల్ల చెట్టుకింద అటలుకట్టి పెట్టవలసి వచ్చింది. పా బైటికి వెళ్ళేవాడు కాదు. భోజనమయాక యింట్లోనే కూర్చుని సితార వ యించేవాడు.

కొన్నాళ్లకి వానలు నిలిచిపోయాయి. చలి, పొగ్గున్నే మంచు కురియటం ప్రారంభమయాయి. పొద్దు తక్కువ కావ టం, వెచ్చదనం కోసం పొయి రాజేయటం, మళ్లా మొదల యాయి. చలి కాలానికి యిక ఆట్టే రోజులు లేవు. అలమారు లోనూ, కొట్టు గదిలోనూ మళ్లా తినుబండారాలు నింపారు. లారా, మేరీ బొంతలు కుట్టడానికి ఉపక్రమించారు. ఇల్లంతా వెచ్చగా తయారయింది. ఒక రోజు రాత్రి భోజనమవగానే పా జింకని వేటాడటానికి వెళుతానన్నాడు. వేసంగి అంతా యింట్లో మాంసం లేకుండానే గడిచిపోయింది మళ్లాచలి కాలం వచ్చింది కనుక, అప్పటికి జింకపిల్లలు ఎదిగి వుంటాయి.

చిట్టడవిలో ఒక ఖాళీ ప్రదేశంలో పా జింకవల పరి చాడు. నేలమీద ఉప్పు జల్లితే, ఆ ఉప్పు తినేందుకు వచ్చిన జింక పాకి పట్టుబడేది. దగ్గిరలోవున్న చెట్టుమీద కూర్చుని పా జింక కోసం కాచుకునుండేవాడు. ఆవేళ పా తుపాకీ

తీసుకుని చిట్టడవిలోకి వెళ్ళిపోయాడు. లారా, మేరీ కథలూ, కబుర్లూ లేకుండానే నిద్రపోయారు.

తెల్లారుతూనే, కిటికీ దగ్గరకి పరుగెత్తి చెట్టుకేసి చూశారు. కాని దానికి జింక వేళ్ళాడటం లేదు. అంతకు ముందెప్పుడూ, జింకని కొట్టేందుకు వెళ్ళిన పా వృత్తిచేతులతో తిరిగిరాలేదు. లారా మేరీ లకి ఏమీ పాలుపోలేదు.

పగలంతా పా యింటి చుట్టూ, గాదె చుట్టూ, వెచ్చదనం కోసరం రాళ్ళు పేర్చి, వాటిమీద ఎండుటాకులు, కొమ్మలు పరిచాడు. ఆ రోజు రాత్రి యింట్లో పెద్ద చలిమంట వెలిగించారు. చలిరాకుండా కిటికీ తలుపులన్నీ గట్టిగా బిగించేశారు. భోజనాలయాక మామూలు ప్రకారం పా లారాని ఒళ్ళోకి తీసుకున్నాడు. పక్కనే చిన్న కుర్చీ వేసుకు కూర్చుంది మేరీ. "ఇవాళ మీకు మాంసం లేకుండా పోయినందుకు కారణం చెబుతాను వినండి. జింకలదగ్గిరికి వెళ్ళగానే, దగ్గరలో వున్న పెద్ద సిందూరపు చెట్టు ఎక్కి కూర్చున్నాను. ఒక కొమ్మమీద సుఖంగా కూర్చుని, జింక కోసరం చూడసాగాను. తుపాకీని గుండ్లతో నింపుకుని, కాళ్ళమీద సిద్ధంగా పెట్టుకున్నాను. ఏ జంతువయినా నాకు సులభంగా దొరికిపోయేట్లు చెట్టుమీద వీలుగా కూర్చున్నాను. కాని నిన్న అంతా కట్టెలు కొట్టి అలసిపోయానేమో! నాకు తెలియకుండానే ఇట్టే నిద్ర పట్టేసింది. కళ్ళు తెరిచేటప్పటికి, అప్పుడే చంద్రోదయమవుతోంది. ఆ వేళ పున్నమి కామోసు! చందమామ గుండ్రంగా, పెద్దగా వుంది. చెట్ల కొమ్మలగుండా, కిందగా ఆకాశంలో నాకు చందమామ కనుపించింది. సరిగ్గా దానికెదురుగుండా ఒక జింక నిలబడి వుంది. మెడపైకి ఎత్తి, చెవులు రిక్కించుకుని ఏదో వింటోంది జింక. వెన్నెట్లో జింక నల్లగా కనపడింది.

గురిచూసి కొడితే ఒక్క దెబ్బకి అది నేలకూలగలదు. కాని ఆ జింక ఎంతో అందంగా వుంది. స్వేచ్ఛగా, హాయిగా విల బడి వున్న ఆ జింకని చంపేందుకు నాకు మనసు రాలేదు. చిట్టడవిలో అది గంతులేసుకుంటూ వెళ్ళిపోయేంతవరకూ, అలాగే దానివంక చూస్తూ కూర్చున్నాను. వెంటనే యింటి దగ్గర మీరూ, మా, మాంసం కోసరం కాచుకుంటారనే విష యం గుర్తుకు వచ్చింది. ఈ మాటు తప్పకుండా దేన్నయినా చంపాలని నిశ్చయించుకున్నాను.

కాస్సేపటికి ఒక పెద్ద ఎలుగుబంటి కనబడింది. వేసంగిలో పళ్లు, ఆకులు తిని తెగ బలిసి, రెండు ఎలుగు బంట్లు అంత లావుగా వుంది ఆ ఎలుగుబంటి. తల అటూ ఇటూ ఊగిస్తూ వెన్నెట్లో ఈడ్చుకుంటూ నడిచివెళ్ళి, ఒక దుంగ దగ్గిర ఆగింది. తుప్పపట్ట వున్న ఆ దుంగని వాసనచూసి కాలితో గీకి, దుంగలోపలి భాగం కొద్దిగా తిన్నది. తర్వాత ముందరి కాళ్లు రెండూ ఎత్తి నిలబడి, చుట్టూ కలియజూసింది. ఏదో అనుమానం కలిగినట్లు, చుట్టూ చూసి, వాసన పట్టే దుకు ప్రయత్నించింది. దాన్ని కాల్చేయాలంటే చాలాసుల భం. కాని, ప్రశాంతంగా వున్న ఆ వెన్నెట్లో దాన్ని చూస్తూ, తుపాకీ విషయమే పూర్తిగా మరిచిపోయాను. దాన్ని అసలు కాల్చాలన్న భావమే నాకు కలగలేదు. ఇంతలో అది వూగుకుంటూ అడవిలోకి వెళ్ళిపోయింది. ఈ విధంగా అయితే యిక నాకు మాంసమే దొరకదు. అని నన్ను నేనే తిట్టుకున్నాను. చెట్టుమీద సర్దుకు కూర్చుని, కాచుకొని వున్నాను. ఈ మాటు ఎట్లాగన్నా ఒక జంతువుని చంపేయా లని తీర్మానించుకున్నాను.

చాలాసేపయాక, ఒక ఆడజింక, దానిపిల్ల చెట్ల నీడ ల్లోంచి గంతులేసుకుంటూ నిర్భయంగా నేను ఉప్పుజల్లిన చోటికి వచ్చి, కాస్త ఉప్పు రుచిచూశాయి. వెంటనే ఒక

దాని ముఖం ఒకటి చూసుకున్నాయి. జింకపిల్ల తల్లిపక్కకి వెళ్ళి నిలబడింది. పక్కపక్కనే నిలబడి అవి రెండూ చిట్టడవినీ, వెన్నెలనీ చూస్తున్నాయి. వాటి కళ్ళు విశాలంగా నల్లగా ఉన్నాయి. ఆ కళ్ళల్లో ఎంతో సౌమ్యం, కాంతి ఉట్టిపడుతున్నాయి. ఆ ఆకర్షణీయమైన దృశ్యం చూస్తూ, నా తుపాకీ మాటే మరిచిపోయాను. అవి చిట్టడివిలోకి వెళ్ళిపోయాక, చెట్టుదిగి యింటికి వచ్చేశాను" అంటూ ముగించాడు పా.

"నువ్వు వాటిని చంపనందుకు నాకెంతో సంతోషంగా వుంది" అంది లారా మెల్లిగా అతని చెవిలో.
"పెన్నా, రొట్టె తిందాములే" అంది మేరీ. పా మేరీని కుర్చీలోంచి తీసుకుని, వారిద్దరినీ గుండెలకి హత్తుకున్నాడు. "మీరు చాలా మంచి పిల్లలు. నిద్రవేళయింది. పడుకోండి. ఇంతలో నేను సితార్ తీసుకు వస్తాను" అన్నాడు

లారా, మేరీ ప్రార్థనలు ముగించి, దుప్పట్లు కప్పుకుని పక్కమీద పడుకున్నారు. చలిమంటలో సితార్ పెట్టుకు కూర్చున్నాడు పా. కావలసినంత వెలుగు ఉండటంవల్ల మా లాంతరు ఆర్పేసింది. పాకి ఎదురుగా తిరుగుడు కుర్చీలో కూర్చుని, మేజోడు అల్లుతోంది. మళ్ళీ చలి, చలిమంట, సంగీతం ప్రారంభమయ్యాయి.

"ఓ! సుసీ నా కోసం ఏడవకు

నేను కాలిఫోర్నియా వెళుతున్నాను."

అంటూ పా దిగులుగా పాడాడు. తర్వాత మళ్ళీ ముసలి గ్రామ్సు పాట మొదలుపెట్టాడు. మునపటిలా కాకుండా కొత్తగా పాడాడు ఆ పాటని.

"పూర్వపు స్నేహాలు మరవట మెలాగ?
వాటినిగురించి ఆలోచించకుండా ఉండట మెలాగ!
స్నేహితుడా! అవన్నీ. నిజంగా
మరి తిరిగి రావా?"

పాట పూర్తవగానే లారా ఏదో అడగబోయింది. "ఇక పడుకో అమ్మా!" అన్నాడు నా.

కాని లారాకి వెంటనే నిద్రపట్టలేదు. కాసేపటివరకూ నా సితార సంగీతం, బైట ఈదురుగాలి హోరు వింటూ పడుకుంది. నా పొయ్యిపక్కన బెంచీమీద కూర్చున్నాడు. మంటలోని వెలుగుపడి అతని గోధుమరంగు జుత్తు, మీసాలు గడ్డం ధగధగ మెరుస్తున్నాయి. మా కిటికీలో నెమ్మదిగా ఊగుతూ అల్లుకుంటోంది. ఆ వెచ్చని ఇల్లు, చలిమంట, నా, మాలనీ చూస్తుంటే లారాకి సంతోషం పొంగుకొచ్చింది. ఆ దృశ్యాన్ని తను ఎన్నటికీ మరిచిపోలేదు. అది ఎన్నాళ్ళ క్రిందటో జరిగిన సంఘటన కాదు అనుకుంటూ లారా సంతృప్తితో నిద్రపోయింది.

---

ముద్రణ: శ్రీ నిలయం, త్యాగరాయనగర్,
మద్రాసు-17